శ్రీ ర స్తు.

తరిగొండ వెంకమ్మకవికృత

# రా జ యో గ సా ర ము

ద్వి ప ద కా వ్య ము.



చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్ర క టి త ము.

1930.

All Rights Reserved.



శ్రీరస్తు.

# రాజయోగసారము.



## ప్రథమప్రకరణము.

శ్రీగణనాథు నాశ్రితపరిపాలు
నాగమసంవేద్యు నాధారసదను
ననిశంబుఁ గీర్తించి యతిభక్తిమెఱయ
ననువుగఁ దఱికుండహరిని మహాను
భావుని భవ్యరూపాంచితు నెంచి
పావనమూర్తిని బరమపావనుని
వేదాంతవేద్యుని విశ్వతోముఖుని
నాదవినోదిని నలినలోచనుని
నాదినారాయణు ననిశంబు మదిని
మోదంబుతో మర్మమును దగుత్రోవ
యందుంచి యచలతత్త్వార్థంబుసరణిఁ
బొందించి భావించి పుణ్యాప్రయుక్త
ఘనత నొసంగు గంగాయమునలకు
ననుపొందుమధ్యయా నాడికాగ్రమునఁ

జెలువారు ఘనమేరుశిఖరంబునందు
లలిని విజ్ఞప్తికళామాత్రుఁ డగుచుఁ
బరుఁ డౌచు వెల్గుసు బ్రహ్మణ్యగురుని
చరణరేణుచయంబు సారెసారెకును
శిరమున ధరియించి చిరభక్తిఁ బెంచి
పరమరహస్యంబు భావమం దుంచి
రహిమీఱ సోమేశ్వరస్వామిఁ దలఁచి
మహితముక్తిప్రదమార్గమునొందు
కొలఁకు విద్యారణ్యగురుని భజించి
వఱల బ్రహ్మేంద్రులఁ బ్రస్తుతిచేసి
ఘనత మీఱ స్వయంప్రకాశులఁ దలఁచి
యనఘాత్ముఁ డగుసచ్చిదానందగురుని
కారణుం డగుమల్లికార్జునగురుని
ధీరుఁడౌ నవధూతదేశికోత్తముని
నచలితపరమహంసాఖ్యసద్గురుని
నచలభక్తుని బడబానలగురుని
నలరు సుజ్ఞానయోగానందగురుని
నిల ధన్యులై నజితేంద్రియగురునిఁ
గర మర్థిమై పరకాయప్రవేశ
గురుని నిత్యానందగురురాజచంద్రుఁ
డరయ నిరంజనుఁ డనుగురు మదిని
నిరతంబు వేఁడుచు నెమ్మిమై మిగులఁ

బోధానందఘనుపదాబ్జంబు
తభక్తిమై నాత్మయందుంచి
ఱరుగ మది నిట్టిగురుపరంపరను
మలహృదయనై సన్నుతిచేసి
ర్వయోగీంద్రులు సంతసింపంగ
ర్వియం దీరాజయోగసారంబు
అల నే ద్విపదకావ్యముగ రచించి
లుకయా హరి కియ్య నెడఁదఁ దలంచి
న్నుగ నాచందములు తేటగాఁగ
న్నవించెద మీకు విశదంబుగాను
నరయ్య కవులార విద్వాంసులార
నరయ్య మీరెల్ల విమలాత్ములార
నయతిప్రాససంగతుల నేనెఱుఁగఁ
వనర నాక్షేపింపఁ దల్పకుఁ డెలమి
శ్రీకరుం డగునారసింహునికరుణ
నీకథాప్రారంభ మెసఁ జేసి తలర
మహితాత్ములార ధర్మాసక్తులార
మహిమాఢ్యుఁ డగుకర్దమప్రజాపతికి
ననుకూలవతి యగునా దేవహూతి
ఘనుసత్పతివ్రత కవనీతలాన
ననురాగయుక్తుఁడౌ నమ్మహాపురుషుఁ
డొనసి పుత్త్రికలతా నింపుగఁ గాంచి

తనయులు లేక డెందమునఁ జింతించి
యనుపమంబైనఘోరాటవి కరిగి
పరమాత్మఁ గూర్చి తపం బాచరించె
నరుదుగఁ బరమాత్మఁ డమ్మహాత్మునకుఁ
బరఁగఁ బ్రత్యక్షమై పల్కె నిమ్మాడ్కి
వరమేమి నీకుఁ గావలె నని యడుగ
విని కర్దముఁడు చాల వేడ్కఁ బ్రార్థించి
యనియెఁ గృపాంబుధి యంబుజనయన
పరమాత్మ నీవు నాపట్టి గావలయు
వర మిదె చాలు నేవర మొల్ల నింక
ననవుఁడు పరమాత్మఁ డావరమిచ్చి
తనరార నంత నంతర్ధానుఁ డయ్యె
నావేళ కర్దముఁ డరిగి మోదముగ
దేవహూతిం గూడెఁ దిరముగ నంత
వెన్నుండు పరికించి వేడ్కతో వచ్చి
యున్నతుఁడై దేవహూతిగర్భమున
గరిమమై జనియించెఁ గపిలుఁ డనంగఁ
గరమర్థిఁ బెంపొంది ఘనుఁ డయ్యె నంతఁ
బూని కొన్నాళ్లకుఁ బుణ్యచారిత్రుఁ
డైనకర్దముఁడు నిజాత్మజుం జూచి
నావరపుత్త్రక నావంశతిలక
నీవు నాసుతుఁడవై నిజముగ నన్నుఁ

జెన్నలరంగఁ బ్రసిద్ధిచేసితివి
అన్న నాకోరిక లన్నిఫలించె
న్యాయంబుఁ దప్పక యానందముగను
బోయెద నింకఁ దపోవనంబునకు
ననుచు సమ్మతిఁ జేసి యాక్షణంబునన
తరవధూమణికిఁ దాఁ దద్వివరంబు
నలరారఁ దెల్పిన నాదేవహూతి
పొలుపొందఁ బతిపదంబులయందు వ్రాలి
పూని యిట్లనియెఁ దాఁ బుణ్యాత్మ యేను
మానసంబునుబట్టి మఱియొంటి నుండఁ
జాల నే నీవెంటఁ జను దెంతు ననిన
నాలలితాంగికి నతఁ డిట్టులనియె
భామ నీ వీరీతిఁ బలుక నేమిటికిఁ
బ్రేమ నాయందున్నఁ బెక్కుధనంబు
నీకుమారుఁడు ధర్మనిపుణుండు గాన
నీకు జీవన్ముక్తి నిజముగ నొసఁగు
వనమున కీవు రావలసిన దేల
వనిత యిచ్చటన నీవ్రతము ఫలించు
నని యొప్పఁజెప్పి యాయతివను సుతుని
నొసరంగ వీడ్కొల్పి యుచితమార్గమున
వరతపోధనదసద్వనమందుఁ జేరి
పరమేశు నెద నుంచి ప్రార్థించుచుండె

నెమ్మి నాకపిలుఁడ నేకవత్సరము
లిమ్ముగ జనకుని యెస నాజ్ఞనుండి
పాయనిసంసారపథ మాత్మఁదలఁగ
మాయావిరహితుఁడై మౌనియై యంతఁ
గాననంబున కేగఁ గా దేవహూతి
యానందనుంజూచి యనియె నిమ్మాడ్కి
వరపుత్త్ర నీతండ్రి వాక్యంబు నేఁడు
సరవి మఱచితె నీస్వాంతమునందు
నానాఁడు నీతండ్రి యరిగెడువేళ
నేను శోకింపఁగ నినుజూపి వగపు
నణఁచి కానకు నేఁగె నమ్మహామహుఁడు
గుణరత్న నిన్నుఁ గన్గొనుచు నేచింత
నెఱుఁగక యుండితి నిన్నాళ్లుదనుక
మఱి నీ వదియు నొగి మది నెంచకుండ
జనకాజ్ఞ వదలి విచ్చలవిడిగాను
నను విడనాడి కానకు నేగఁ దగునె
తల్లిదండ్రులు పరదైవంబు లంచు
నెల్లవా రనుచుండ నెఱుఁగవె నీవు
నీమదిలో నుండునీతి భావించి
యేమున్న మాటాడు మెల్ల నిల్కడగ
అన విని కపిలాఖ్యుఁ డల్లన నవ్వి
జనితల్లి నీక్షించి తా నిట్టు లనియె.

తల్లికిఁ గపిలుఁడు విరక్తిమార్గము బోధించుట.

ఏలకో జనని నీ కీపామరంబు
చాలించు నిది వట్టిజాలిజగాన
తలిదండ్రు లెవ్వారు తనయు లెవ్వారు
దెలియ బుద్బుదము లీదేహంబు లెపుడు
కాయ మస్థిర మని కడఁ గానలేక
పాయక సంసారబద్ధులై మమత
వదలక కామ్యార్థవాంఛితు లగుచు
మదమత్తు లగుచు దుర్మార్గంబునొంది
మదిలోన నుబ్బి కామక్రోధలోభ
మదమోహమచ్చరా ల్మాటికిఁ బెంచి
సంపద గల్గితే సామర్థ్య మంచు
సొం పగుతుచ్ఛమౌ సుఖమును గోరి
కామాంధు లై తమగతి గానలేక
భామలవలలోనఁ బడి లేవలేక
తఱగనితాపత్రయవార్ధిలోన
మఱిమఱి మునుఁగుచు మమత రెట్టింప
నాలుబిడ్డల కనియర్థంబు గూర్చి
కాలంబు నూరక గడుపుచు నుండి
యంతకాలము వచ్చినప్పుడు యముని
చింతఁ జేయుచు హింసచేఁ గంది గుంది
కూపంబు లోఁబడి కొన్నాళ్లు కఠిన

పాపాత్ము లగుచుం బ్రపంచంబునందుఁ
బుట్టుచు గిట్టుచుఁ బొరలుచుండెదరు
ఇట్టిపుట్టులు చావు లెన్నంగ వశమె
యన దేవహూతి నిజాత్మజుం జూచి
యనియెఁ గుమార! యీ యవనీతలానఁ
బట్టుగ నిరతంబు బహురూపపటిమె
నిట్టిపిండోత్పత్తి యెట్లగు ననిన
విని కపిలుండు సద్వినయంబు మెఱయ
జననితో నిట్లనె సంతసంపడఁగ.

## పిండోత్పత్తిలక్షణము.

విను పంక దల్లి తద్వృత్తాంత మీవు
తనరంగ నన్నమదంబును మించి
సతిపతు లిద్దఱు సంతసం బలర
రతి సల్పఁగా ననురాగంబు మించి
నెలవుగ శుక్లశోణితములు రెండు
కలసి యేకంబుగ గర్భమందుండి
నెఱి నది యైదింట నీటఁబుగ్గౌను
పఱిదగ గట్టియౌఁ బదిదినంబులకు
నమరి పదేనింట నండమై యుండు
స్థిమితమై నెలనింట శిరమేరుపడును
బరగ నెలల్ రెంటఁ బదకరంబులును
సరవిగ నేర్పడు చందము దెలియ

నొనర నెలల్ మూఁట కుదరంబు గల్గు
ననబోడి నాల్గింట నడుము పార్శ్వంబు
లొందును బాదంబు లొందు నాపైని
బొందుగ నాఱింటఁ బుట్టు నేత్రములు
సరవి నేడవనెల సరగ ఁవుండు
పరఁగఁ బ్రవేశించుఁ బాయక యంద
పఱియు నష్టమమాస మహితతేజమును
బఱిదగ విజ్ఞానపరధనం బలరి
లలి ధాత్రిఁ బ్రసవకాలంబునువఱకు
మలమూత్రములఁ జిక్కి మఱి యాత్మఁ గుంది
యిటకటా! నాపూర్వకర్మంబువలనఁ
బటుతరపాపకూపంబునం బడితి
పూర్వజన్మంబున బుద్ధిలేకుండ
గర్వించి సత్క్రియల్ గాంచకపోతి
సద్గురు నాశ్రయించంగఁ బోనైతి
సద్గతి నేను విచారింపనైతిఁ
బామరంబునఁ బడి పరభామినులను
గామించి యవివేకకలితుండనైతి
బాలబుద్ధులుచేతఁ బాతకం బనక
చాలఁ బెద్దలను దూషణము చేసితిని
తనువు లస్థిరములు ద్రవ్య మస్థిరము
లని యించుకేనియు నారయనైతిఁ

బెను ప్రేమ పెండ్లము బిడ్డలఁ జూచి
మనమున హర్షించి మత్తుఁడనైతి
గాన నీవిధ మగుకష్టకూపాన
నేను జిక్కితి నింక నెవ్వరు దిక్కు
ఈమూత్రమలకూప మే నింకఁ గడచి
భూమిపై వ్రాలిన బుద్ధి తెచ్చుకుని
పరమదేశికపదాబ్జంబుల వేఁడి
పరమైన నిర్వాణపదము నొందెదను
మఱచియుండను దొంటి మాయలోఁ బడను
మఱి యిప్పు డీమూత్రమలకూప మేను
ఎప్పుడు దాఁటెద నని యెంచుచుండ
నప్పుడు తొమ్మిది యగునెలల్ మించ
ధరణిపైఁ బడఁగ నంతట విష్ణుమాయ
తఱచుగఁ గప్పినఁ దల్లడిల్లుచును
ఆవేళ శిశువయి యన్నియు మఱచి
కావున యేడ్చి యక్కడకుఁ దక్క మఱచి
మునుపటిజ్ఞానంబు మోసమై మించ
మునఁ బడి తనమలమూత్రాదులందుఁ
బొరలుచు దుర్బలంబున నుండఁగాను
గురుతుగ నట గాలి గుంతయుఁ ద్రవ్వి
కిసరులు కూనలు కిన్కసందులను
ముసరులు దగ్గులు ముట్టుదోషములు

ననుభవించుచు వృద్ధి యై వయోధర్మ
మును మించి వచ్చినప్పుడు మత్తుఁ డగుచు
వసుధఁ బెండిలియాడి వరసుతసుతుల
నెసఁ గాంచి వారల నెలమిఁ బోషింప
భూవరులను వేఁడి పొల్పుగ ధనము
నేవగనైనఁ దా నెసఁ గూర్చి మించి
భూరిలోభము దారపుత్త్రాదుల నొగి
వారక గాచుచు వసుధఁ గట్టకడ
కడు వృద్ధదశ రాగఁ గాయంబువడఁక
దడవుచు మంచానఁ దగఁ జేరియుండి
చెవుడువట్టి మతేమి చేయుటలేక
యెవరువచ్చినఁగాని యెఱుఁగకయుండి
ఆలుబిడ్డలఁ జూచి యకట నే వీండ్రఁ
బాలించువిధమును బరికింపనైతి
నని ప్రలాపించుచు నంతకాలమున
మొనసి వచ్చినయమముఖ్యసేవకులఁ
గనుఁగొని యఱచుచుఁ గనుల మూయంగ
వెనువెంట గొంపోయి విభునిడగ్గఱగ
నిలువఁజేయఁగఁ జూచి నెఱిఁ బాపములను
దెలియంగ నాశ్రాద్ధదేవుండు వడిగ
నడుగ లెక్కలు చూచి యాచిత్రగుప్తుఁ
డెలమిఁ జెప్పఁగ వెంట హింసచేయుఁ డన

భటు లట్లనేతు రెప్పటివలెఁ బుడమి
నటఁ బుట్టవలయుఁ బాయక బంధుమిత్రు
లంత కాలంబున నయ్యయో యంచుఁ
జింతించుచుందురు ారి డగ్గఱఁగఁ
గావున జీవుని కఠినమార్గంబు
కానంగలేరు టక్కరిమాయవలన
తనువులఁ దామని దలఁచుచుండుదురు
తనువులోపల కర్మతతి విచారింప 120
నెత్తురుప్రేవులు నిండుమాంసంబు
హత్తినయెముకలు సధికమౌ చీము
మొనసినచర్మంబు మూత్రంబు మలము
నెనసి దేహములోన నెసఁగుచు నుండు
నటువంటిఘటములం దాకాంక్షఁజేసి
కుటిలులై తమలోన గుఱిఁ గానలేరు
అన విని యాయింతి యాత్మజుం జూచి
యనియె నోతనయ మాయాప్రపంచంబు
నెవ్వరు గల్పించి రెఱిఁగింపు మనిన
నవ్వారిజాక్షికి నతఁ డిట్టులనియె.

### విశ్వోత్పత్తిఘట్టము.

విలసితమైన యీవిశ్వమంతయును
గలిగినచందము క్రమముగ వినుము
నిత్యుండు నచలుండు నిర్వికారుండు

సత్యుండు సగుణుండు సర్వాత్మకుండు
ననెడుపరబ్రహ్మ యాదికాలమున
ఘనతరమై నిరాకారమై యుండె
నతనియందు ననాది యైనట్టిమాయ
యతఁడు గూడి వహించె నవ్యాకృతసంజ్ఞ
నెలమి నచ్చటఁ గల్గె హేమగర్భుండు
కలకంఠి యా హేమగర్భునియందుఁ
దలఁగక యట మహాతత్వంబు పుట్టె
నలరంగఁ గలిగె నహంకారమందు
నది మూఁడుభాగంబు లై వృద్ధిఁబొందె
ముదిత సత్వరజస్తమోభేదములను
బొందె సత్వమున నింపుగ జ్ఞాన మరయఁ
బొందుగ రాజసంబున నుద్భవించె
నలరార కర్మేంద్రియములు తామసను
వలనఁ దన్మాత్రంబు వరుసఁగఁ గల్గె
నందు శబ్దంబున నభ్రంబు వొడమె
నందు సదాశివుఁ డధినాథుఁ డయ్యె
మఱియును స్పర్శతన్మాత్రంబువలనఁ
గఱువలి గలిగె నక్కడ నీశ్వరుండు
నలరార నచ్చటి కధికారి యయ్యెఁ
దలకొని యట రూపతన్మాత్రవలన
నొనర హుతాశనుఁ డుద్భవుం డయ్యె

ననిశంబు నిట్టివాయుతాశనాకృతికిఁ
బరగ రుద్రుం డధిపతి యయ్యె నవల
సరవిని రసమున జల ముద్భవించె
హరి నాయకుం డయ్యె నప్సరో వినుము
మఱియును గంధతన్మాత్రంబువలన
సముదయం బయ్యె విశ్వంభరయందుఁ
గమలసంభవుఁ డధికర్తయై నిల్చెఁ
బ్రకటితమైన యీపంచభూతముల
నొకటొక్కటిని రెండు నొనర భాగించి
యందందు నొక్కనిజాంశంబు నుంచి
యందందుఁ దక్కినయట్టియం దొకటి
కలకంఠి నాల్గేసిగా విభాగించి
కలయఁ బంచిననవి క్రమముగఁ బుడమిఁ
బంచీకృతం బయ్యెఁ బరికింపఁ దల్లి
యంచితంబుగ విను మది యెట్టులనినఁ
బొందుగ నాకాశమున నర్ధమయ్యె
నందు జ్ఞాతృత్వము నం దొగి నాల్గు
నగుభాగములఁ బవనాగ్నిజలముల
నొగిఁ గూడి మానసం బొగి బుద్ధి చిత్త
మును నహంకారంబు మొనసి వాతూల
మున నర్ధభాగంబు పుణ్యచరిత్ర
అరయ వ్యానం బయ్యె నటు నిల్చెనాల్గు

నిరవుగ భూమి వహ్ని జలంబు గగన
ములఁ గూడి యింతకు మూలంబు నగుచు
నల పంచభూతంబు లయ్యె నెంచఁగను
తల్లి హుతాశనార్థము చక్షువయ్యె
నెల్లఁ దక్కిననాలు గెంచ భూనీర
మరుదంబరముల మర్మంబుగఁ గూడి
యరయఁ ద్వక్ఛ్రోత్ర జిహ్వాఘ్రాణములను
గలిగె నీ రర్ధభాగము రసంబయ్యె
నలినాక్షి తక్కిననాల్గు భూవహ్ని
మారుతాంబరముల మఱి గూడి వరుస
నారూప మాశబ్ద మాస్పరిశంబు
తనరార నోజ గంధంబయ్యె నట్ల
మొనసి యాభూమ్యర్థమున పాయువయ్యెఁ
తల్లిరో విను మొగిఁ దక్కిననాల్గు
నల్ల ధనంజయ యనిలాంబరముల
సారంబులై కూడి సల్పుక్రియలకు
నారూఢిహేతువు లైనట్టిగుహ్య
హస్తవాక్పాదంబు లనువుగఁ గల్గి
విస్తరిల్లెను బంచవింశతిక్రమము.

### పంచవింశతితత్వప్రకరణము.

వీనుల కింపుగ విను మోక్షపథము
పూని జెప్పెదఁ బంచభూతంబులకును
బలము సద్యోజాత వామదేవులును
బొలఁతి యఘోరతత్పురుషు లీశానుఁ
డనెడు పంచబ్రహ్మ లా బ్రహ్మ విష్ణుఁ
డును రుద్రుఁ డీశ్వరుఁ డొగి సదాశివుఁడు
పంచకర్త లనంగఁ బ్రఖ్యాతులైరి
యంచితమౌ మానసాదులు నైదు
రాణింపఁగాను బరాశక్తి యయ్యెఁ
బ్రాణాదివాయువు ల్పట్టుగఁ జూడ
నాదిశక్తి యనంగ నమరె శ్రోత్రేంద్రి
యాదులు నైదయ్యె నలర విజ్ఞాన
మరయ నీభూమ్యాదు లైదుతత్వములు
సరవిగ నెంచ నిచ్ఛాశక్తి యయ్యెఁ
గ్రమముగ వాగాదికర్మేంద్రియములు
నమరఁ గ్రియాశక్తి యయ్యె నోతల్లి
అన్నియుఁ గూడి బ్రహ్మాండమై నిలిచె
నెన్నఁగ శ్రీజగదీశుఁడౌ శ్రీవి
రాజితుండును శ్రీవిరాట్పురుషరూప
మాజగదాకృతి కరయఁ బెంపారె

పాతాళలోకంబు పదమయ్యె నట్లు
ఖ్యాతిగ సత్యలోకంబు శీర్షంబు
లోకము లెల్ల నాలోకింప నాదు
శ్రీకరతనువై చెలఁగునోతల్లి
అనువొంద నిట్టిమహావిగ్రహునకుఁ
గొనకొని యన్నిదిక్కులు శ్రోత్ర మరయ
నొనరంగ వినుము వాయువు త్వగింద్రియము
మొనయు నేత్రేంద్రియ మొప్ప భానుండు
పరఁగ భ్రూయుగ్మంబు బ్రహ్మపదంబు
చిరతరవరుణుండు జిహ్వేంద్రియంబు
వెలియ నాశికము నశ్వినిదేవతలును
వలనొప్ప వహ్నిగ వాగింద్రియంబు
తెలియ బాహువు లెల్ల దేవతాధిపుఁడు
తలఁగకుండును భాగతత్వంబు లరయఁ
బరగ నుపేంద్రుండు పాదేంద్రియంబు
పరికింపఁగా బ్రజాపతియు గుహ్యంబు
వలనొప్ప మృత్యుదేవత యగునంబు
కలువపువ్వులచెలికాఁడు మనంబు
మతి బ్రహ్మదేవుండు మహనీయచిత్త
మతులిత క్షేత్రజ్ఞుఁ డనఁబడుచుండు
ననుపమాహంకారుఁ డగురుద్రమూర్తి

తనర జ్ఞాతృత్వ మంతఃకరణంబు
సరవిగ జీవునిచంద మిామిాఁదఁ
బరగఁ జెప్పెద విను బ్రాకటంబుగను
అలరు ఘటాకాశ మం దొప్పుగాను
గలిగినజలములోఁ గన్పట్టు నభము
గతి సాక్షియం దున్న గ్రాలెడుబుద్ధి
బ్రతిబింబితం బైనబ్రహ్మ మిారీతి
జీవుఁడ ననుభ్రాంతిచేఁ జిక్కి మించి
సావధానక్రియాశక్తినిఁ గూడి
రూఢిమై తనస్వస్వరూపంబు మఱచి
మూఢుఁ డై షడ్వర్గములకు లోఁబడుచుఁ
దులవమై మానసాదులచేతఁ జిక్కి
కలుషాత్ముఁ డై తన్ను గానక భ్రమసి
భిన్నభావములచేఁ బెక్కుదేహములు
పన్నుగ ధరియించి పరవశత్వమున
స్త్రీలు పుర్షు లటంచుఁ జెడుగుభేదముల
వాలాయముగఁ జిక్కి వాంఛతోఁ దగిలి
వారును వీరును వారు మే మనుచు
భారంబుగను నహంభావ మూహించి
జీవభ్రమములచేఁ జెడి పలుమాఱు
చావు పుట్టువు గల్గి జడుఁ డాయె నిప్పు

డెప్పు డైనను జీవుఁ డిదియెల్ల విడచి
యొప్పుగ విజ్ఞానయుక్తినిఁ గూడి
తన్ను దాఁ దెలిసిన ధన్యునిఁ జేరి
పన్నుగ నతనిచే బ్రహ్మంబు దెలిసి
కామాదిశత్రుల ఖండించివైచి
యామూక సకలేంద్రియాల జయించి
నిటలభాగంబున నిలచి శోధించి
ఘటము బయల్జేసి కడఁగాంచె నేని
యతఁడ పరబ్రహ్మ మతఁడ స్వయంభు
వతఁడ మహావిష్ణు వతఁడ శివుండు
అతనికి వేఱలే దనుచు బోధింప
నతనికి ట్లనివల్కె నా దేవహూతి
మలమూత్రరక్త దుర్మాంసంబు చీము
గలిగిన దుర్గంధకాయంబులందు
నిరవుగ నాబ్రహ్మ మేరీతి నుండు
సరవి నాకెఱఁగింపు సదయాత్మ యనఁగఁ
గపిలుఁ డాతల్లిని గరిమనుఁ జూచి
యపు డిట్లు వచియించె నమ్మరో వినుము
ఇది సోమనాథ విశ్వేశునిపేర
పదవాక్య భవ్యసుబ్రహ్మణ్యయోగి
చరణాంబుజాతషట్చరణాయమాన
పరిపూర్ణ నిత్యసద్భావనిమగ్న

మానస యగు వేంక మాంబికారచిత
మైనట్టి రాజయోగామృతసార
మం దెన్నఁగాఁ బ్రథమాఖ్యప్రకరణ
మొందు శ్రీతఱికుండపురిధాముఁ డైన
వీరనృసింహాఖ్యుఁడు వెలయఁ గైకొనియె
ధారుణి నాచంద్రతారార్కముగను.

ప్రథమప్రకరణము సంపూర్ణము.



శ్రీరస్తు.

# రాజయోగసారము



## ద్వితీయప్రకరణము.

శ్రీకరానందవశీకరం బైన
ప్రాకటభక్తిమై భావ మంతయును
వినుము నీ వత్యంతవేడ్క నోతల్లి
కనఁగ సుగంధదుర్గంధముల్ రెండు
ననుపమపరమాత్ముఁ డంటి రెంటికిని
దనరారఁగాను మేధ్యామేధ్యములను
బ్రతిఫలింపదె భాను భాసురకిరణ
గతిగ సంవ్యాప్తంబుగాఁ దనరార
నతనికి నేమంటె నర్కునిభాతి
అతులితంబుగ నాత్మ కంట దేమియును
మతిమంతులకు నట్లు మలినంబు లేదు
క్షితి నీవిధంబును జెలఁగి చూడంగఁ
గటిలత్వరహిత మెక్కువగాఁగ నిట్టి
ఘటములోనివిధంబు గ్రమముగ వినుము
సలలితపంచవింశతితత్వములను

బొలుపొందు స్థూలాఖ్య పుణ్యచరిత్ర
కాయంబులో సప్తకమలంబు లుండుఁ
బాయక వానిని బరఁగఁ జెప్పెదను
దొలుత నాధారము న్దోయజాతంబు
సలలితమౌ రహస్యస్థానమందు
గొనకొని నాల్గురేకులపీతవర్ణ
మును వశషసలను ముఖ్యాక్షరములు
ననువుగ భూముద్ర నమరుచు నుండు
నెనసి యచ్చటను గంగేశ్వరుఁ డుండు
నలరఁగ విను దాని కావలివిధము
దలకొని యంగుళద్వయముమీఁదటను
ధీరత మీఱ స్వాధిష్ఠానజలజ
మాఱురేకులతోడ నమరు శ్వేతముగ
నది బభమయరలా యనువర్ణములను
అది పక్షిముద్రయం చనఁ దగి మఱియు
జలజాతభవుఁడు నిశ్చలత నుండు నొగి
నలఘుప్రకాశుఁ డై యమ్మరో వినుము
మొనసి యష్టాంగుళములమీఁదఁ దనరి
యనువుగ మణిపూరకాఖ్యంబు వెలుగు
నెఱి ఱేకులును బది నీలవర్ణంబు
వఱల డాదిఫకారవర్ణము ల్గల్గి
యనువర్ణము ల్గల్గి యాపీతముద్ర

యొనరంగ వెన్నుఁ డం దొప్పుచు నుండు
పదియంగుళములకుఁ బైన నాహతము
హృదయప్రదేశమందిరముగ నుండు
భామవి ద్ద్వాదశపత్రము ల్గలిగి
హేమవర్ణంబున నింపొందు నందు
నఖిలవాక్యావళి కాస్పదం బగుచు
కఖగఘఙలు చఛాఖ్యలు జఝఞలును
ననువొందఁగా టఠా యనులింగముద్ర
దనరారు రుద్రుఁ డాస్థానాధిపతియు
నావల మఱి ద్వాదశాంగుళములను
ధావళ్యరుచి విశుద్ధంబు పదాఱు
దళములై, అఆలు దానికి వర్ణ
ములు నగునది మత్స్యముద్ర జీవుండు
అందుండు మఱి ద్వాదశాంగుళములను
బొందుగ భ్రూమధ్యమున దళద్వయము
అందుఁ బావకదీప్తి యలరుచు నుండు
నందు హంసలు రెండు నమరుచు నుండు
ధరణిఁ బ్రకాశముద్ర యనంగ నదియ
పరమాత్ముఁ డచ్చట ప్రభువై వెలుంగు
నందుకు నవల సహస్రారమందుఁ
గ్రందుగ నుండు హకారసకార
బీజద్వయం బాత్మ బిందువుఁ గూడి

తేజరిల్లుచు నుండు దేదీప్యముగను
గగనముద్రయు నదె గన్గొనఁ దల్లి
సగుణనిర్గుణరూప సచ్చిదానంద
గురురాజచంద్రుఁడు కొల్వారుచుండు
సరవి నన్నిటికిఁ దా సాక్షియై యుండు
పనివడి విను మంబ ప్రాణానిలంబు
మొనసి యాహృత్పద్మమున నిల్చియుండు
తఱుచైనపవనుఁ డాధారచక్రమున
విరివిగ నేవేళ విహరింపుచుండు
అలసమానుఁడు నాభియందు నవ్యానుఁ
డలరి సర్వాంగంబులందుఁ దానుండు
గళమున రోమసంఘంబులయందుఁ
దొలఁగక నాగ వాతూలంబు మఱియు
ననఘ లలాటమం దాకూర్మపవనుఁ
డనువొంద ఘ్రాణమం దాకుకురుండు
కంటిపై నుండును ఘనదేవదత్తుఁ
డంట నారంధ్రమం దాధనంజయుఁడు
అనుదశవాయువు లంగములందు
మొనసి తత్తత్కార్యములు సల్పుచుండు
లలిని యిళాపింగళలు సుషుమ్నయును
నలరార నాధారమందుండి వచ్చి
మొనసి యాజ్ఞాచక్రమున మూఁడుఁ గూడి

యమవొందఁగా మతి యంతట నిలుచుఁ
దనర సుషుమ్న మంతట నిల్వ కరిగి
ఘనతగఁ గ్రమముగఁ గ్రాలుచు నుండి
సరవిగ ఘనసహస్రారంబు నేరి
గురుతరంబుగ నందు గోప్యమై యుండు
దేహమధ్యంబునఁ దిరుగు జీవుండు
సోహం బటంచు సంశోభితంబుగను
మొనసి యహోరాత్రములను జపంబు
నొనరంగ నిరువదియొక్క వేయార్వు
నూఱును జేసి యనూనంబు గాఁగ
నాఱు నూ ఱాదిగణాధీశునకును
ఆఱువే లా బ్రహ్మ కాఱ్వేలు హరికి
నాఱువే లారుద్రుఁ డనుదైవమునకు
వేయి సదాశివ విభవమూర్తికిని
వేయి యంతర్యాత్మకు వేయి గురువుకును
వాసిగ దినమును వరుస నర్పణము
చేసినఁగాని యాజీవుండు మగుడి
భాసురమతి నిట్టిభావంబుగాను
శ్రీసద్గురుని మేటిరీతి నీలాగు
కాశిగయా ప్రయాగలు నంద యుండు
దేశికుఁ డటుమహాదేవుఁ డై యుండు
పోఁడిమి మీఱఁ బెంపొందుచు మధ్య

నాడి సహస్రారనాళమై యుండు
నదియ సరస్వతి యదె పరంజ్యోతి
యదె యూర్ధ్వకుండలి యదె సుధాధార
యదె భూతతతిహేతు వదె తటిద్వల్లి
యదె చిద్విలాసంబు నదె పరమంబు
ఇటువంటిసుధ దేహి కెస నంటనీక
కుటిలమార్గత నధగకుండలి పొంచి
పటుశక్తి నమృతంబు పానంబు చేయ
నిటువంటికీలకం బెఱుఁగక దేహి
కాయమే నని యహంకారి యై యాత్మ
నాయకుఁ గనలేక నానావిధాల
ముక్తి నొందెద నని ముందు గానకయ
శక్తిచేఁ గర్మముల్ సల్పుచు నెపుడు
కాశికిఁ బోయి చక్కఁగ గంగలోన
నాశగ మునిఁగినయప్పుడ తనకు
నంటుపోవునె మోక్ష మబ్బునె తల్లి
తొంటిపాపము వోయి దొరకునెసుఖము. 60

## జీవన్ముక్తివిచారఘట్టము.

అని యిటువల్కిన నాదేవహూతి
తనసుతు నీక్షించి తగ నిట్టు లనియె
పావనచరిత జీవన్ముక్తి నరుని
కేవిధంబునఁ గల్గు నెఱిఁగింపు మనిన

జనయిత్రిఁ జూచి యాసత్కుమారుండు
మనమున హర్షించి మాత కిట్లనియె
వినవమ్మ జనని యీవిశ్వంబునందు
మనుజులు వేఱు కర్మంబులు విడచి
తను దాను దెలిసినధన్యునిఁ జేరి
పనివడి ద్వాదశాబ్దములు శుశ్రూషఁ
జేసి మెప్పింపఁగ శ్రీగురుమూర్తి
భాసురంబుగ వారిభక్తికి మెచ్చి
యసదృశసిద్ధాసనాసీనుఁ జేసి
భసితంబు తమఫాలభాగాల నుంచి
వారితత్పూర్వపువ్రాలెల్లఁ దీసి
భూరికృపవ్రాలు పొందుగ వ్రాసి
జడియకుఁ డని వారిజడుపెల్లఁ దీర్చి
కడువేడ్క రాజయోగప్రకారంబు
సాంగముగను జెప్పి సాధుపథంబు
శృంగాటకంబునఁ జేరి చూడుఁ డని
గురుమూర్తి యపుడు మక్కువ మీఱ శిష్యుఁ
డరుదుగఁ దనమానసాబ్జమం దుంచి
పరమార్థసరణి సద్భావంబు మీఱఁ
బరమామృతధ్యానపరవశత్వమున
మనసు సహస్రారమధ్యమం దుంచి
మొనసి తా నపుడు షణ్ముఖ యనుముద్ర

యందుఁ జూడంగ నందంతఁ గన్పట్టు
నందున లీనమై యంధకారంబు
బంధురంబై జీవపరమాత్ములకును
సంధాన మొనగూడుసమయంబు రాగఁ
బ్రణవమందపరోక్షభావానుగతిని
ఘుణఘుణత్కారమై గగనమార్గాన
మొఱయుచు నుండుఁ ద్రిమూర్తిస్వరూప
పరమార్థ మని దాని భావింపవలయుఁ
బంచనగంబు లేర్పడఁ గానవచ్చు
నంచితంబుగ నందు నరయంగ శుభము
గొనకొనఁ గాత్మెఱుంగులు పుష్పవృష్టి
యును తరంగములు మయూరపింఛములు
సలలితవిమలనక్షత్రముల్ దీప
కళికలు రవిచంద్రకళలు శోభిల్లు
వింతగ నప్పుడు వెల్గులోపలను
సంతసింపుచు నుండు సద్గురూక్తముగఁ
బూనియుండిన పూర్వబోధను జెంది
జ్ఞానాంజనము దృఢజ్ఞానానఁ జూచి
కపటప్రపంచాంధకారంబు వాసి
యపుడు స్థావరజంగమాకృతు లెల్ల
మొనసి భూమి నడంచి మున్నీట ముంచి
యనలంబులో వేల్చి యనలంబుఁ జేర్చి

యనలంబు నాకాశమందునఁ గూర్చి
ఘన మగుశూన్యమార్గంబున నిలిచి
తఱచగ హంకారతత్త్వము ల్మీఱ
నరసి మహాతత్త్వ మతివేగ దాఁటి
శ్రీమహితానందసీమనుఁ జేరి
యామోద మలరి దృశ్యావళు ల్మఱచి
సలలితానందుఁడై శాంతి వహించి
వెలిలోను లోలోను వెలయునుగాని
తెలివిఁ దానని చూచు దివ్యశాంతునకుఁ
దొలఁగుకర్మంబు పెంద్రోవను జేరు
నిట్టిజీవన్ముక్తి యెంతఁ జూచినను
బట్టుగఁ బరగఁ దపంబు చేసినను
కాశిగయాప్రయాగలనైన లేదు
దేశదేశంబులు దిరిగిన లేదు
వెలయు సంసారము ల్విడిచిన లేదు
బలు క్షుత్పిపాసాలు వట్టిన లేదు
శిలల బొమ్మల పూజ చేసిన లేదు
తలఁప దిగంబరత్వములలో లేదు
జడలు దాల్చిన లేదు సర్వకాలంబు
నడవులు దిరిగిన నలసిన లేదు
స్నానదానసకామజపముల లేదు
మౌనంబులను లేదు మాటల లేదు

వితరణంబుల లేదు విద్యల లేదు
వ్రతములలో లేదు క్రతువుల లేదు
మతములలో లేదు మహిమలో లేదు
సతతంబు నన్నియు సల్పువారలకు
నలరంగ దివ్యస్వర్గాదిభోగములు
గలిగి యాపుణ్యముల్ కడ ముట్టఁగాను
సమసినప్పుడ చాల జన్మంబు లెత్తి
శ్రమములు వడుచుండు సరవిగ నెపుడు
గనుక స్వర్గాదిభోగము లిచ్ఛయింప
కను మనశ్శుద్ధి చక్కఁగఁ జేసి పరము
సద్గతిగాను విచారించి యపుడు
సద్గురుచే వేదసారంబు దెలిసి
మమతను విడి కూటమార్గంబు చేరి
అమలసాంఖ్యము తారకామనస్కములఁ
గలిగిన యనుభవక్రమములం దెలసి
సలలిత శివయోగసచ్చిదానంద
వైరాగ్యసుఖకేళివార్ధిలో మునిఁగి
వైరాగ్యసంపద వఱలుచుండంగ
నవధూతభావుఁడై యాత్మను జెంది
ప్రవిమలజ్ఞానంబు ప్రబలుచుండంగఁ
దానను నహామును దగ్ధంబు చేసి
తానను దానై యుండు తత్త్వంబు దెలిసి

నిగమాంతవేత్తయై నిలిచినవాఁడు
మఱు డిందురాఁడు జన్మము నెత్తఁబోఁడు
మఱికొంద ఱీమహామహిమఁ గానకయ
గురు నెఱుంగక కర్మగురుచెంతఁ జేరి
గాథకుఁ జిక్కి దుష్కర్మమార్గమున
సాధనంబుగ యోగసరణులఁ దెలిసి
యలమట నాసనాభ్యాసము ల్చేసి
చలమున బాహ్యలక్ష్యములు చూపుచును
కూలంకషములోనిగుఱిఁ గానలేక
లాలితంబుగ మంత్రలయహఠయోగ
ఫలములం గోరుచుం బామరు లగుచు
జలబుద్బుదమువంటి జన్మంబులకును
సిద్ధులం గోరి ప్రసిద్ధమై యోగ
సిద్ధాంతమందు సుస్థిరమతి లేక
అగణితవిషయసుఖాసక్తి మీరఁ
దగ మణిమంత్రసిద్ధక్రియల్ నేర్చి
మఱి పామరులకెల్ల మహిమలం జూపి
తిరిగెడువార లీ దేహవాసనలు
వీడఁగ నేరరు వేదాంతమందుఁ
గూడ నేరరు వట్టికుంభనగాని
వరముక్తిఁ బొందెడువాఁడు త్రికూట
మరయఁగ నిష్ఠమైనందునఁ జెంది

నెలవుగ నా త్రివేణీసంగమమున
జలకంబు లాడి విశ్రాంతివహించి
వెలిప్రపంచంబును విడిచి యాలోన
నిలిచి చూచెడితెల్వి నే నని నిజము
నరసిన బ్రహ్మవిద్యాధురంధరులు
దొరఁకొని కాయసిద్ధులు గోరఁబోరు
నూరక సంసారయుక్తులై యుండి
ధారాళముగఁ దమ్ముఁ దాము చూచుకొని
జలజపత్రంబులో జలముచందాన
నలరి సంసారమునం దంట కెప్పు
డుండుధన్యులు సిద్ధయోగులు గాక
ఖండవిద్యలు నేర్చి గర్వంబు మించి
స్తంభనమోహనోచ్చాటనమంత్ర
జృంభణంబులు సూపి చెలఁగెడువారు
పవనయోగము నేర్చి పటుయుక్తిఁ బెంచి
యవిరళంబుగఁ దటాకాంతరమంబు
మహిమఁ జూపుటకుఁ బద్మాసనంబునను
సహజంబుగా నుండి జనుల మెప్పించి
బద్ధులై యంతకుఁ బరమైన యోగ
సిద్ధాంత మెఱుఁగక చెడిపోవువారు
కడుపునిండఁగ నుదకంబును బీల్చి
కడుపున మలమెల్లఁ గడగి శోధించి

యిది యాత్మసిద్ధి యౌ నని నిశ్చయించి
ముదమంది తమలోన ముఱిసెడువారు
వాయుధారణసేసి వసుధఁ గొన్నాళ్లు
కాయంబు వేయేండ్లు కాపాడువారు
ఆత్మానుభవులుగ నరసి వీక్షించి
యాత్మను గాంచిన యవధూతమూర్తి
అల నభోమధ్య కుంభాకృతిగాను
వెలిలోను వెల్గుచు విషయశూన్యముగ
జలరాశిగతకలశంబుచందానఁ
బొలుపొంద వెలిలోను పూర్ణమై యుండి
అంతముఁ దాఁ గాక యంతఁ దా నగుచు
సంతతానందాబ్ధిచంద్రుఁ డై యున్న
యతఁడె యోగీశ్వరుఁ డతఁడె ధర్మాత్ముఁ
డతఁడె పరాత్పరుం డతఁడె సద్గురుఁడు
ఇటువంటి గురుతత్త్వ మెఱుఁగక నీవు
మటుమాయగాఁ జిక్కి మై నీడవలెను
తనవారు పెఱవారు తగుపాటిబంధు
లనియెడుభ్రమలు సత్యంబుగ నమ్మి
ననుఁజూచి నీవు కానకు నేఁగఁదగునె?
యని పల్కితివి మాయ ననుసరణగను
భాసురమతి నిట్టి భావంబు విడచు
నీసుతుఁడనుగాను నెఱివినుతల్లి

నానాఁడు కర్దముం డత్యుగ్రతపము
పూని సేయుటఁజేసి పుత్రుఁడ నైతిఁ
గాన నే నీసొమ్ము గాను నిక్కముగ
మానసంబును నిది మఱచిపో తల్లి
సుతుఁ డని నన్నింకఁ జూడకు మమ్మ
అతలాదిలోకంబు లన్నియు నేను
పంచభూతము లేను ప్రణవంబు నేను
బంచకోశం బేను బరతత్వ మేను
గణుతింప సోమ భాస్కర వహ్ను లేను
అణువు మహత్తు లే నఖిలంబు లేను
సగుణభావంబున సర్వమందుండి
యగణితవిభవంబు లనుభవించుచును
పరమైన నిర్గుణభావంబు నొంది
సరవి నంతటికిని సాక్షి నై యుందు
జనయిత్రి నాయంద జగములు నుండు
మొనసి నానాలోకముల నుండు నేను
అలదర్పణంబులో నాననాబ్జంబు
చెలువొందఁ బ్రతిఫలించినచందమునను
నాయందు జగములు నానావిధముల
మాయగ నీరీతి మలయుచు నుండు
నటుగాన ముకురమందా ప్రతిబింబ
మెటువలె దబ్బరో యొఱఁగి చూచినను

నటువలె నాయందు నఖిలలోకములు
మటుమాయగా నుండు మైనీడవోలె
నగణితమైన విశ్వాకృతి యగుచుఁ
దగిలియుం దగలక తనరెడువాఁడఁ
గాని నిక్కంబు చక్కఁగ విచారింప
నేన కర్తయు భోక్త నేన బ్రహ్మంబు
అని స్వస్వరూపంబు నప్పుడు చూపఁ
దనయుఁడు గాఁడని తద్దయు నెంచి
కడుదురాశలు మాని కడుభక్తిఁ బూని
కొడుకు నావేళ సద్గురునిగ నెంచి
పావనచారిత్ర పరమపవిత్ర
నీవంటిధన్యుండు నీవంటిసుకృతుఁ
డేవిధమున నాకు నెస సుతుఁ డైతి?
దేవ జీవన్ముక్తి డిరముగ నీయు
మింతియ చాలు మఱేమియు నొల్ల
నంతెయు విడచితి నయ్యా నీ దయను
ఏ నొల్ల భాగ్యంబు నే నొల్ల పదవి
నే నొల్ల సంసార మే నొల్ల నెల్ల
నీలీలఁ దెలియక యే యిన్నినాళ్లు
కాలంబు నూరక గడపుచు నుంటి

సకలలోకాతీత సత్యమా తత్వ
మింక నైన నుపదేశ మీవయ్య దేవ
అన విని కపిలుఁ డయ్యంబ కిట్లనియె
జనని నీ వత్యంతసద్గుణవతివి
కావున నీరీతిగా బ్రహ్మవిద్య
కావలె నంటివి గలుగదా నీకు
నని యిట్టు పల్కి సిద్ధాసనమందు
దనతల్లి నునిచి యత్తఱి లలాటమునఁ
జెలువుగ వీభూతిచేఁ జుక్క పెట్టి
మలినంబుఁ బోఁ ద్రోసి మస్తక మంటి
బోధింపఁ దొడఁగె నాపుణ్యసాధ్వి కొగి
సాధురక్షకుఁడు నిశ్చలత నిట్లనియె
నోయమ్మ నీవింక నొగి నిశ్చలముఁగ
మాయాప్రపంచంబు మానసమందు
మఱచి నిశ్చాయవై మామాట నుండు
మిరవుగఁ బరమార్థ మేర్పఱించెదను
దేవ నీ విప్పుడు దేహంబు గావు
నీ వింద్రియంబులు నిజముగఁ గావు
నీవు స్త్రీయును గావు నీవు నపుంస
భావంబు గావు గొప్పగఁ బుర్షరూప 170

ధారివి గావు నిం దలఁప వృక్ష పశు
ధారివి గావు సత్యంబును వఱల
భావనాతీత సద్బ్రహ్మంబు నీవు
నీవ యఖండంబు నీ వవ్యయంబు
నీవ ప్రకాశను నీవ బ్రహ్మంబు
భావింప నిను నీవు పరగ నెఱుంగు
కనిపించువస్తు వెక్కడనైన లేదు
అని యిట్లు పల్కిన నాయింతి సుతుని
గనుఁగొని పల్కెఁ జక్కనియుక్తి మెఱయ
విను మని యాతఁడె వెన్నుని కెలమి
నేను బ్రహ్మంబునై నిర్వికల్పంబు
గా నుండఁగానె యాకరణి నిద్రయును
ఆహారమును గల్గు నట్లుండు టేమి
యోసరో విచిత్రమై యున్నది దీని
భావంబు దెల్పు తప్పకు మన్న నతఁడు
దేవహూతికి నిట్లు దెలుపఁగఁ దొడఁగె
ఇది సోమనాథవిశ్వేశుని పేర
పదవాక్యభవ్యసుబ్రహ్మణ్యయోగి
చరణాంబుజాత షట్చరణాయమాన
పరిపూర్ణనిత్యసద్భావనిమగ్న 180

మానస యగు వేంకమాంబికారచిత
మైనట్టి రాజయోగామృతసార
మం దెన్నఁగా ద్వితీయప్రకరణము
పొందుగఁ దరిగొండపురిధాముఁ డైన
వీరనృసింహుండు వేడ్కఁ గైకొనియె
ధారణి నాచంద్రతారార్కముగను.

ద్వితీయప్రకరణము సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# రాజయోగసారము



## తృతీయప్రకరణము.

శ్రీ రాజయోగసుస్థిరమహామహిమ
సారమై వెలుఁగు ముజ్జగములయందు
హరిణాక్షి నీ విప్పు డడిగినప్రశ్న
సరవిమై విను మది సంతసంబుగను
ఘనతరమోహదుఃఖంబులు రెండు
తనరారఁగా మనోధర్మంబు లరయ
బలములై తగుక్షుత్పిపాసలు రెండు
నలప్రాణధర్మంబు లనఁబడుచుండు
మర్మంబు విను జన్మమరణము ల్దేహ
ధర్మంబు లనఁబడు తల్లిరో వినుము
ఇదియ షడూర్ములై యెల్లకాలంబు
గదలక యాత్మను గలసిన ట్లుండు
నాయాత్మ కొకకోటి నంట దూహింప
నాయాత్మ సాన్నిధ్య మందు సంతతము.

## పంచవింశతిప్రకరణములు.

గగనంబు శ్రోత్రమై గగనసంబంధ
మగుచున్నశబ్దంబు నాలింపుచుండు

అనిలంబు త్వక్కునై యనిలసంబంధ
మనఁదగుస్పర్శ మెయ్యనైనఁ దెలియు
ననలంబు చక్షులై యనిలసంబంధ
మననొప్పు రూపంబు నరుడుగఁ జూచు
జలము జిహ్వాయజలసంబంధ మగుచు
విలసిల్లు రసమును వింతగఁ గ్రోలు
జగతియ ఘ్రాణమై జగతిసంబంధ
మగుచున్న గంధంబు నగునిద్ర దనరి
వరుసగఁ బలుకును వాగింద్రియంబు
చరియింపుచుండును జరణేంద్రియంబు
సొరిదిగ నిచ్చి పుచ్చుకొను హస్తములు
సరవిగఁ బాయుపస్థలు రెంటివలన
జలమలంబులను విసర్జించుఁ దల్లి
నిలయంబులై యుండు నెఱి నెందుకైన
మనసున సంశయ మానుము జనని
తనర నేమైనఁ జిత్తము విచారించు
నన్నియు నేను నే నని యహంకార
మున్నతత్వంబు నుప్పొంగుచు నుండు
నంతఃకరణరూప మగుచు జ్ఞాతృత్వ
మంతటఁ దా నెప్పు డమరుచు నుండు
మొనసి ప్రాణాపానములు సంతసంబు
జనని యుచ్ఛ్వాసనిశ్వాసరూపములు

నలినమిత్రామిత్రనాడులలోన
నలరఁ జరించు సోహం సోహ మంచు
నదియ జపాఖ్య మహామంత్రసంజ్ఞ
యదె జీవపరమున కైక్యంబు దెల్పు
నకుటిల మా హృదయంతరస్థలిని
నొకయష్టదళపద్మ మొనరుచు నుండు
నాలోన హంసదీపాకృతి యగుచుఁ
దాలిమి మా నష్టదళములమీఁదఁ
గరువలి చలనంబు గల్గినకతనఁ
బరిశోభితంబుగఁ బ్రసరించుచుండు
నొక్కొక్కదళమున నొక్కొక్కచింత
తక్కక గల్గుఁ దద్ధర్మంబులెల్ల
వరుసఁగ దెల్పెద వారక తల్లి
సురరాజదళమున సుకృతంబుచింత
బలువహ్నిదళమున భక్షించుచింత
అల యమభాగమందలి పాపచింత
సరవి నైఋతిని దోషము లెన్నుచింత
నెఱి వరుణునిదిశ నిద్రించుచింత
చాలవాయువుదిశ సంచారచింత
యాలోన ధనదుని యలధర్మచింత
వఱల నీశాన్యాన వైరాగ్యచింత
సరవిగ నాజ్యోతి జలజమధ్యమున

బన్ను గనిల్చినఁ బరమార్థచింత •
తొన్నెన్ని చందంబు లీశరీరమున
ఖండవృత్తులుగఁ బ్రకాశించుచుండు
దండిగ నీవది దగనేమిగావు
ఆవేళఁ జెప్పినయట్టిచందమునఁ
బావన మగుపరబ్రహ్మంబు నీవు
గగన మధ్యములోనఁ గన్పట్టుకరణి
నగణితంబుగ బ్రహ్మ మాబుద్ధియందు
బ్రతిఫలింపుచుఁ జిదభ్యాసాఖ్య నమరె
నతఁడు జీవుఁ డనంగ నలరారె వినుము
అలరార నాజీవుఁ డాననాబ్జమున
వెలసి జాగ్రతయందు విఖ్యాతి నమరి
స్థూలాభిమాని యై సొంపుగ విషయ
జాలంబులం గ్రీడ సల్పుచు నుండు
తనరఁ గంఠమునందుఁ దైజసాఖ్యమున
ననువుగ సూక్ష్మదేహము నావరించి
యంతరింద్రియముల ననుసరించుకొని
వింతవింతగ స్వప్నవిభవంబు గాంచి
తదనంతరమున రుద్రగ్రంధిఁ జొచ్చి
పదిలంబుగా నందుఁ బ్రజ్ఞాఖ్య నలరి 40
కారణదేహంబు గైకొని యచట
ధీరుఁ డై యంతరింద్రియముల నడఁచి

తెఱఁగార నట సుషుప్తిని జెంది యవల
సురుచిరమైన విష్ణుగ్రంథిఁ జొచ్చి
ఘనమహాకారణాంగంబు ధరించి
యనువుగ నచట తుర్యాఖ్య వహించి
మఱియు నందుండి బ్రహ్మగ్రంథిఁ జొచ్చి
సరవిఁ దుర్యాతీతసంజ్ఞ వహించి
క్రమముగ నాధారకమలంబు చేరి
అమర నచ్చట పరమానంద మేమొ
కరమర్థి క్షణముండి క్రమ్మరం దిరిగి
సరగున సామపంచకమును గూడి
మొనసి యాజ్ఞాచక్రమున నిల్చియుండు
వనజాప్తుఁ డుదయించి వచ్చినజనులు
మురసి తత్తత్కార్యములు సల్పుపగిది
నరయ భ్రూమధ్యమం దాత్మభాస్కరుఁడు
నిలిచి యుండినవేళ నిఖిలేంద్రియంబు
నలరారఁ దమపను లన్ని గావించి
యవల సుషుప్తియం దనుదినం బడఁగు
నవియెల్ల నీవు పాయక విను మమ్మ
అనువొంద నివియ నీవైనసుషుప్తి
నను నిత్య మొందకు నశ్వరం బగుచు
నీకు నాశము లేదు నిత్యం బటంచుఁ
బ్రాకటంబుగ శ్రుతు ల్పల్కుచు నుండు

కావున విలయ మక్కడ నీకుఁ గలదె?
యీవిధ మింద్రియావస్థల నైన
భావమెల్లను తేటపఱచెద వినుము
సావధానంబుగఁ జక్కఁగ నిపుడు
ఎపుడు నీదేహంబు నెఱఁగెడు తెల్వి
యెపుడు సుషుప్తి తా నెందును బోయె
సహజంబుగా దాని సరవి నెట్లనిన
నహ మనియెడుభావ మాసుప్తిలోను
లయ మైనవేళ నీ లాలితజ్ఞప్తి
జయముగ నచట నే సాక్షియై యుండు
ఇది లేక యుండిన నింతలో నెలమి
నిదుర మేల్కని లేచి నే నింతతడవు
పొలువొందఁగా నిద్రఁ బోయితి నంచుఁ
దెలియువా రెవ్వ రా తెల్వియు గాక
యానిర్గుణజ్ఞప్తి యందుండఁగానె
పూని యహంకృతి పొడము గ్రమ్మరనె 60
యానిర్గుణజ్ఞప్తి యట లేకయున్నఁ
బూని దానికి నిదె పోకడై యుండు
మందమై దేహంబు మఱచు టేమనిన
నం దహంకృతిక లేక యానిర్గుణాత్మ
తాను దానై యుండు తన్మయత్వమునఁ
గాన నహంకృతికరణి సంతతికి

నమర కారణ మయ్యె నాయహంకృతికి
నమలాత్మ కారణ మని చెప్పఁబడును
ఆరీతి యెట్లన్న నయ్యహంకార
మారయ సుప్తియం దణఁగినయప్పు
డుండు వెలుంగుచు నుండును జ్ఞప్తి
యుండఁగ గద నంతే యొకకొంతప్రొద్దు
గనినపిమ్మట నైన గ్రక్కున లేచి
గను నీప్రపంచసంగతు లాత్మ నిచట
నుండక యున్నను నూహింపరాదు
ఖండితంబుగ సర్వకారణ మాత్మ
ఆయహంకృతి హేతు వఖిలకృత్యములు
నాయహంకృతి శూన్య మైనవేళలను
సత్యాత్మ కీప్రపంచ క్రియల్ లేవు
నిత్యమై శుద్ధమై నిర్వికారమునఁ
దాను దానై తాను తనలోన వెలుఁగు
గాన నాత్మయ నిర్వికారనిర్గుణము
ఇల స్వయంజ్యోతిరై యిది ప్రకాశించె
లలిఁ దలంపంగఁ గాలత్రయంబునకు
ఆరయావస్థాత్రయమునకు దేహ
కారణాలకు మూలకారణం బగుచు
సుక్షేత్రనయనాగ్రసుషిరాంతరమున
నక్షయం బై పరమామృతనిత్య

పరిపూర్ణమై పరబ్రహ్మమై విమల
తరమై పరాత్పరతత్వమై భేద
రహితమై యమితమై రమ్యమై చూడ
సహజమై యచలమై శాంతమై యొనర
సదమలవేదాంతసారమై మఱియు
నిదురకు మొదలుగ నిర్మలంబైన
తెలివికిఁ దుదయైన దేదీప్య మగుచు
సలలితమై సర్వసాక్షియై దనరి
గణనాధికానందకారియు నగుచు
నణువుకు నణువైన యనవరతంబు
నామహత్తుకు మహత్తై రెంటికన్న
తా మించి పరమసత్తామాత్ర మగుచు 80
వెలిలోను శూన్యమై వెలిలోను నంది
వెలిలోను గాకయ వెలుఁగుచు నుండు
అది నీవుగాఁ జూచి యానంద మొందు
మదియెట్లు నే నౌను నని యంటివేని
అద్దంబులోఁ జొచ్చినటువంటి గగన
మద్దంబు భిన్నమైనప్పుడు తనకుఁ
గారణమైన నాకాశానఁ గలయు
నారీతిగా బుద్ధి యణఁగినపిదప
పరికించి జీవుఁ డన్పంచవింశకుఁడు
అరయఁగ షడ్వింశకాభిధానంబు

కలిగిన యాబ్రహ్మకళయందె గలయు
నెలనాగ భావింపు మిది సౌఖ్యసరణి
నిది శాస్త్రములచేత నెఱిఁగినంతటనె
పొదలెడుసంశయంబులు వీడరాదు
వరశక్తి సుజ్ఞాన వైరాగ్యసరణి
నరయుచు నీయోగ మనవరతంబు
మననంబు చేసి సమ్మత మొందవలయు
మననంబు సేయక మఱి యుండిరేని
యామనంబున నింద్రియాదులఁ గూడి
కామాదిశత్రువర్గము నాశ్రయించు
కావున మదిఁ జక్కఁగం బట్టి నిలుప
గావలె నిల్ప కెక్కుడి దీ మనంబు
తారకయోగావధాని యైనట్టి
ధీరుఁడు దాని నిందింపఁగ నేర్చు
నని యిట్లు పలుకఁగ నాచంద్రవదన
తనయుని జూచి సంతస మార ననియె

### తారకలక్షణము.

ఓతండ్రి తారకయోగలక్షణము
ఖ్యాతిగఁ జెప్పి న న్నడతేర్చు మనఁగ
నానంద మంది మహామహుఁడు గని
పూని యిమ్మెయి నొగి బోధింపఁ దొడఁగెఁ
గ్రమముగ సకలయోగంబులయందుఁ

విమలమై శ్రేష్ఠమై వెలయు తారకము
వినవమ్మ యిది రెండువిధములై యుండు
నొనర పూర్వాపరయోగంబు లనఁగ
నమర నచ్చట పూర్వ మగుతారకంబు
క్రమముగ రాజయోగం బపరంబు
గరిమమై పూర్వయోగము తో ర్తె వినుము
చిరముగ నెల్ల మూర్తిమయంబు నగుచు
భాసురలీల రూపగుణంబు లైన
యాసోమసూర్యబింబాంతరాళమునఁ 10
దళతళవెలిఁగెడు తారకలోన
నెలవుగ నొనఁగూర్చి నిటలంబు చేర్చి
యొక్కింత భ్రూయుగం బొనరంగఁ బైకి
నిక్కించి నడిమింట నిల్పి చూచినను
అచట నాత్మప్రత్యయంబు లావేళ
ప్రచురంబులై తోఁచు బహువిధంబులను
అవి చూచుచును మనం బట్టిట్టు పోక
యవిరళప్రజ్ఞతో నచట నిల్పుచును
మన మట్ల నిల్పిన మారుతం బపుడు
పనివడి తాఁ బట్టువడియుండు నచట
పొసఁగ మారుతమనంబులు గూడి యున్న
ననదృశం బగుబుద్ధి కప్పు డేకాగ్ర
భావంబు కల్గు నాభావంబు సగుణ

భావంబు లెల్ల తప్పకచూచుచుండు
నామూపు ప్రత్యయం బభ్యాసపరణి
చూచుచుండఁగ నందు సుచిదంబురాశి
యందు దృశ్యంబులు నడఁగి యిన్నిటికిఁ
జెందినయొకటి తా శేషించి యుండు
మొఱసి ధ్యాతధ్యానములు లేక యుండు
వినరాక యిమ్ముగ వెల్గుచు నుండు
నది యమనస్కాఖ్య మగువరయోగ
మఱియు దానికిఁ బరం బైనది లేదు
క్రమముగ సకలయోగవిధానములకు
రమణీయ మై తాన రా జగుచుండు
కావున రాజయోగం బనుపేర
పావనమై గోప్య భావ మై యుండు
మురువుమీరఁ ద్రికూటమునకుఁ బూర్వానఁ
బరికింప నొప్పును బావనానలము
దానిపై భూమ్యాది తత్వంబు లైదు
పూనిన వర్ణము లొప్పలుపొందు చుండు
నానిగ్గులో నుండు ననలమండలము
దానిలోపల నుండు తరణిమండలము
మఱి దానిలోఁ జంద్రమండల ముండు
నరుదుగ దానిలో నంకురం బొకటి
అఱయు భవ్యాకార మై చెల్వమీఱ

నది బీజమై యుండు నఖిలంబులకును
అచటఁ బ్రవర్తించు నఖిలదృశ్యములు
ప్రచురంబుగాఁ బరాత్పరవస్తు వరయ
ఘనతరా వాఙ్జ్యోతిగతిని రేఁపవలు
మొనసి యంతర్బాహ్యముల వెల్గుచుండు
నారయ నుపనిషదర్థసూచకము
వేఱు చిత్తము లేక విన దృఢంబుగను
అలరార నీలతోయదమధ్యమందు
వెలుఁగు విద్యుల్లేఖవిధమున మఱియు
సురుచిరనీవారశూకంబు పగిది
నరయ నీలచ్ఛాయ నలరుచు మఱియుఁ
జెలువంద పావకశిఖదానినడుమ
బలముగ వ్యాపించి పరమాత్మ యుండు
నిది బ్రహ్మ యిదె శివుం డిదియ విష్ణుండు
నదియ దేవేంద్రుండు నదియ యక్షరము
అదియుపో పరమంబు నదియే స్వరాట్టు
నదియ సత్తామాత్ర మని యార్యజనులు
తఱచుగ దైవభేదంబు లెన్నుదురు
పరతత్త్వమున భేదభావంబు లేదు
నామరూపంబు లెన్నఁగ వేఱులైన
హేమంబునకు భేద మెందైనఁ గలదె?
ఆరీతి వెల్గు నాయాత్మఁ జూచుటకు

సారమై యుండును శాంభవిముద్ర
వలనొప్ప క్షులయ గావలె నెట్టులనిన
నరుల పాడ్యమిదృష్టి యమవసదృష్టి
అల పౌర్ణవమిదృష్టి యనెడుసంజ్ఞలను
విలసిల్లుచును మూఁడు విధములై యుండు
సరగ నీమూఁటిలోపల తొలిరెంటిఁ
బరిహరింపుచు మహాప్రజ్ఞ దీపింప
సరవి మూఁడవమాపు సాధింపవలయు
నరయ నేర్పున లక్ష్య మనువెలదృష్టి
కలిగి రెప్పలపాటు కలగకుండినను
విలసిత మగుశాంభవీముద్ర యగును
ఈముద్ర ధరియించి యేకాగ్రమతిని
యూమద్వయము చూడ నపుడుమానసము
కరువలి క్షీరోదకన్యాయ మగుచుఁ
బరువడిఁ గూడి లోపల నిల్చియుండు
నొనరంగ నందులో నొకటి చలించి
చన రెండవదియు నాసరణిదీపింప
నా రెంటి నొకచోట నమరంగఁ గూర్చి
సారంబు తనర నిశ్చలత వహించి
నిర్వికల్పసమాధి నిలచిన నదియ
సర్వంబు గనుఁగొను సత్పథం బరయ
రాజయోగంబు విరాజమానంబు

నైజమా సచ్చిదానందపదంబు
పాటించి బుద్ధి నీభావంబునందు
నాటించు మని పల్కు నందను జూచి
నాతండ్రి సచ్చిదానందలక్షణము
ఖ్యాతిగఁ దెల్పిన న్గరుణించు మనిన
జనని వీక్షించి విశ్వాసంబుతోడ
మునిరాజచంద్రుండు మొనసి యిట్లనియె
నలినాక్షి సచ్చిదానందప్రభావ
మెలమితో నిపుడు నీ కెఱింగింతు వినుము
లలి నొప్పుచున్న నీలజ్యోతిలోన
విలసిత చిద్బిందు వెలుఁగుచునుండు
సరసమై యచ్చట స్ఫటిక తేజంబు
చిరమైన యాపరశివకళై యుండు
జనని యాశివకళ సత్తన నొప్పు
ననఘ చిద్బిందుచిత్తనఁగఁ బెంపొందు
నవి రెండు గలయుట యానంద మగుచు
వివరంబుగాఁ దత్వవిదు లెఱుంగుదురు
ఒనరంగ నదియ నింకొకరీతిగాను
వినుము చెప్పెద దాని వేడ్క నోతల్లి
కనుఁగొన నీసర్వ కామరూపములు
ననువుగ సచ్చిదానందంబు గలదు
ఈరూపనామంబు లెసలారుచున్న

నల యస్తిభాతిప్రియములు భావింప
సత్తులింగ మనంగ సహజమై యుండు
చిత్తన నంగంబు చెలువంబు మీఱు
నీరెండు నొక్కటి యే యై నదృశ్య
కారణమై విశ్వగర్భమై వెలుఁగు
నలఘునాదము లింగ మనఁగఁ బెంపొందు
నల బిందు వగుచును నమరు నారెండు
ఘనత సాంఖ్యం బైన కళ యగునదియ
పెను ఘనునాదంబు బిందుకళయన
నీమూఁడు కాధార మేస్థాన మనిన
కోమల మైన త్రికూటస్థలమున
లలితమై యొప్పునీలచ్ఛాయవ లెను
పొలుపొందునట్టి యాపోజ్యోతినడును
విలసితచిద్బిందు వెలుఁగుచు నుండు
నలర నాబిందులోన లఘునాదంబు
పలుకుచు నుండును బరమార్థ మైన
కళనాదబిందుసంకలితమై యుండు
అదె మూలప్రకృతియు నదె దేవహూతి
పదిలంబుగాను త్వంపద తత్పదములు
అసిపదభావ మింకలర తేటగను
పొసగఁ జెప్పెద విను బొంపిరివోవ
తనరంగఁ ద్వంపదార్థము జీవుఁ డనఁగ

విను తత్పదార్థంబు విమలచిదాత్మ
ఈ రెంటి కైక్యంబ యొస నసిపదము
సారో క్తిగా నీవు సరణి భావింపు
మదె తత్వ మదె భావ మదె నిరాలంబ
మది సర్వసాక్షి నీ వదియ తలంప
నలరంగ నీచంద మనవరతంబు
తలఁపుచు నుండు నంతర్లక్ష్యమందు
వెలుపల లోపల వెలిని యానదుమ
పొలుపొంద వెలుఁగు నాపోజ్యోతియందు
నిదుర జెందినరీతి నిల్పితివేని
యదియ యంతర్లక్ష్య మని చెప్పఁబడును
అది మహాకాశచిదాకాశ మనఁగఁ
బొదలు చిదంబరం బొనరంగ వినుము
తనకార నీనభాధారము చేసి
రొనరంగ నొకటితో నొక్కటిగూర్చి
యగణితం బైనచిదంబరస్థలిని
తగ నిల్ప నదియ యాంతర్లక్ష్య మగును 170
జనని నీమనము నిశ్చల మైనదనుక
మొనసి యంతర్లక్ష్యముద్ర యేమరకు
మది యేమఱిన నిర్జరాదుల కైన
మది సంశయంబులు మానవు దల్ప
కావున నీవిద్య క్రమము దప్పకయ

కైవల్యచిన్మాత్రకళయందు బుద్ధి
నాటించి సచ్చిదానందపదంబు
పాటించి నీవని భావింపుచుండు
తెలిసిన తెల్వియుం దెలియని మఱపు
తెలియ కానందదాబ్ధిఁ దేలి యుండినది
బ్రహ్మసాక్షాత్కారపద మని తెలియు
బ్రహ్మానుభవ మందె యిట్టుగ నిల్పు
మెఱుక నీ వనుచు నీ వెఱిఁగినవెన్క
వఱల నీదేహంబు వాసన ల్మగుడ
కలిగిన నది బంధకము గాదు నీకు
వల నొప్ప సాదృశ్యవాక్యంబు వినుము
చెలువొంద ముత్యపుఁజిప్పలో వ్రాలి
సలిలంబు ముత్యమై సరవిఁ జిప్పనొగి
తొల్లిటివలె నీలతోయమై పోవు
తల్లి నీ వారీతి ధన్యత నొందు
నీయాత్మ నీవయై నిల్చినవెన్క
మాయ నిన్నంటునే మాయ యేదనిన
నిన్నుఁ గానక తనువే నీ వన భ్రమసి
యున్నాళ్లు పరమార్థ మెఱుఁగకయున్న
ఇదియపో మాయ యిం కెయ్యది గాదు
మది నెన్న నొకరూపు మాయకు లేదు
అదియ నిర్వచనీయ మదియనిగాదు

అది గల్గి లేనిది యదియయవిద్య
యదియెట్లు జని యుంచు నదియెట్టు లడఁగు
నది తేటపఱచు మనంగ నిట్లనియె
పరిశుద్ధమైన నభంబు వీక్షింప
సొరిది నీలచ్ఛాయ చూపట్టునటుల
నిర్మలమై వెల్గు నిర్గుణమందుఁ
గర్మంబు గర్మగఁ గల్గినమాయ
యెందెందుఁ జూచిన యేకమై పొంది
యుండి యంచును జూడ నుండును మాయ
యెందు లేదని చూడ నెటులేదు మాయ
యందునీలత్వమాకాశంబు నందు
నెటువలె దబ్బరో యెఱుకతోఁ జూడ
నటువలెనే దబ్బరై యుండు మాయ
యిదివరదాక ని న్నెనసినమాయ
మదితోడ నీమాయ మాయమై పోయె
మాయాలోపల మాయ మహనీయమాయ
యీయఖండజ్ఞప్తి యెఱుఁగనిమాయ
యిటువంటిపరమార్థ మిధ్యాత్రిలోన
కుటిలచిత్తులకు సద్గురుదూషకులకు
నత్యంతవిషయేంద్రియాసక్తులకును
సత్య మూహింపని సంశయాత్ములకు
భీతాత్ములకు మిత్రభేదవాదులకు

నీతిహీనాన్యులకును నిర్దయాత్ములకు
కామంబు గల యహంకారచిత్తులకుఁ
గామకర్మాసక్తి గల్గువారలకు
నుపదేశ మిచ్చిన నూరకలేని
విపరీతసంశయవితతులు చెలఁగు
గాన పృథగ్జ్ఞానకలితులు గారు
గాననీపద్విద్య గావలె నంచు
నడిగి నప్పుడనిశ్చితార్థుఁ డటంచు
నెడఁబాయకే విద్య యియ్యఁగరాదు
ఈవిద్య కర్హుఁ డింకెవఁ డంటివేని
పావనవైరాగ్యపద్ధతు లెఱిఁగి
తలఁగక మొదటి సాధనచతుష్టయము
చెలఁగ నభ్యాసంబు చేసినవాఁడు
శమదమాదులు గల్గి సద్గురుపాద
కమలంబులే గతి గా నమ్మువాఁడు
కనులముందఱ పరాంగన నిల్చియున్న
తను గన్నతల్లిగఁ దలఁచినవాఁడు
పరులవిత్తము లగుపడిన వీక్షించి
సరగునఁ దనకేలు చాఁచనివాఁడు
ఎక్కడి సంసార మెక్కడఁ గల్గు
నెక్కడ నడఁగు నే నెవ్వఁ డటంచుఁ
దనుదాన వెదకుచుం దనమనంబునను

ఁని బూని యీశ్వరార్పణము చేయుచును
విగతసంకల్పుఁడై విహితకర్మములు
తగ సల్పుచును భూతదయగలవాఁడు
సంతతంబును యదృచ్ఛాలాభమునకు
సంతసింపుచు సాధుజనులతో మైత్రి
శాంతవర్తనముచే సల్పెడువాఁడు
శాంతవేత్తల నొక్కసారి వంచించి
యది చెల్వు నిది చెల్వు ననిత్వరపడక
సదమలుఁడై ధర్మ మనవరతంబు
కారణగురుమూర్తిఁ గన్గొన్న లోన
సారెకు మెలఁగుచు సామి యింకేమి
శరణంబు లేదు మీచరణద్వయంబ
శరణంబు నాకు నిశ్చయముగా ననుచుఁ
బదరి తా నడుగక భక్తి యేమఱక
చెదరక శుశ్రూష సెడువాఁడు
అవనిలో విద్యకు నర్హుఁడై యుండు
నవలసంశయములు నన్నియుం దీరు
నిటువంటిసద్విద్య నెఱుఁగ నేరకయ
యటుమాయచేఁ జిక్కి మదమత్తులైన
ఘోరాత్మకులువారు గొఱ్ఱెలు గాక
వారి కెక్కడిది జీవన్ముక్తిసుఖము
అందందుఁ బాఁతిర్యగ్జంతుతతుల

యందు జనింపుచు నడఁగుచు నుండు
పొలుపొందనటుకొంత పుణ్యవేషంబు
కలిగి యామనుజుఁడుగాఁ బుట్టి యపుడ
కనవచ్చు మోక్ష మేగతినైన నిపుడు
గనలేనివానికిఁ గల్గునే యవల
నిపు డిట్టి సుజ్ఞాన మెఱుఁగనివారు
చపలాత్ములై మఱి జన్మజన్మమున 220
పాపంబు చేసి తత్పారంబు లేని
కూపాన మఱి మునుంగుచుఁ దేలుచుండు
రిటువంటిసంసార మెసలారు చుండి
యటువిరక్తిని దోసి పరమాత్ముఁ డైన
కారణగురు చేరి కడతేరినట్టి
ధీరమానసుఁ డాదిదేవుఁ డై నిల్చి
యున్నగఁ దనఘుటప్రారబ్ధమునను
ఎన్నిదినంబు లింకీధరయందు
విహరింపుచుండును విశ్వ మంతయును
సహింప మీర వినోదమాత్రుఁ డై చూచుఁ
దలఁపున విధినిషేధము లెంచఁబోఁడు
వెలఁగి తా నొకరిని సేవించఁబోఁడు
భేదవాదులతోడ బిట్టుగఁ దర్క
వాదము లాడఁడు వదఱ డెప్పుడును
ఎందుఁ జూచినఁ గాని యెఱుఁగనివాని

చందంబుతోఁ గడు సాత్త్వికుఁ డగును
నతుల ప్రకాశుఁ డై యానంద మొందు
నతఁ డిల నవధూత యనిపించుకొనును
విలసితముగ బ్రహ్మవేత్తలక్షణము
తెలిపెద విను మింకఁ దెలుఁగునో తల్లి
గురుకటాక్షంబున గుఱియందు భ్రమసి
గురుతరసంసారగోష్ఠియందుండు
నమలుఁడై లౌకిక మనుసరించుకొని
యమరంగ శత్రుమిత్రాదుల బ్రహ్మ
భావంబుగాఁ గని పరమతత్త్వైక్య
భావుఁడై యెప్పుడు నిర్భరచిత్తుఁ డగుచు
వాసి నింద్రియముల వ్యాపారములను
జేసి యడంగును సిద్ధం బటంచు
పరమాత్మ తా నను భావ మేమనక
యరుదుగ సంసారి యగు నొకవేళ
నుప్పొంగి యోగియై యుండు నొక్కతఱి
నెప్పు డెట్లుండుట నెఱుఁగంగరాదు
ఘనమైన రాజయోగప్రకారమునఁ
దనయభీష్టముగ స్వతంత్రుఁడై మఱలు
జల మంటనట్టియీ సరణి దీపించు
నలరు దేహంబున నబ్జపత్రమునఁ
దనరంగ జలమునఁ దా నంట దెపుడు

మనుజులు కొందఱా మహిమఁ గానకయ
సంసారియై మనచందంబు నుండి
హంసస్వరూపు మెట్లగును వీఁడంచు
దూషించుచుందురు దోడరి యారీతి
దూషించువారికిఁ దొలఁగక యోగి
చేసినసుకృతక్రియ ల్చేరు నాక్షణము
వాసిగఁ గొందఱా వరయోగియందు
నిలుకడగా భక్తి నిల్పి సంతతము
వెలయుఁ దద్గుణములు వినిపించు చున్న
వారికి నాయోగి వాంఛలు లేక
ధీరుఁడై చేసినదివ్యపుణ్యములు
చేరుచు నుండుఁ బ్రసిద్ధంబుగాను
సారెకీలోకానుసారంబుకొఱకు
నిర్మలుఁడగుయోగినేర్పునం జేయు
కర్మముల్ రెండుభాగంబులై పోవు
నతనికి నీరెండు నంట దూషింప
నతఁడు నిర్విషయుఁడై యానందమొందు
అల తొలియవధూత యాబ్రహ్మవేత్త
పొలుపొందుసమయము పొందుచుండునొగి
అతఁడు విరక్తుఁడై యడవిలో నున్న
నితఁడు సంసారియై యింటిలోనున్న
నెక్కువ తక్కువ లెన్నంగ రాదు

తక్కక మోక్ష మిద్దరికిని సమము
పొలుపొంద నంచితపూర్వజన్మమున
బలముగ శైశవోపాసన సి
గురుతను మోక్షంబు కోరినకతన
రువడి నా సుఖప్రారబ్ధగతిని
అనుగ సంసారి యై ముక్తి నొందెఁ
బరికించి చూడ నప్పరమావధూత
అల పూర్వజన్మంబునందు శంకరుని
చెలఁగి యుపాసనచేసి భావమునఁ
గ్రమముగ మోక్షము గామించుకతన
రమణీయుఁడై ల విరక్తుఁడై నిల్చి
మోహపాశములను మొదలంటఁ గోసి
సాహసుఁడై ముక్తి సాధించుకొనియె
నిరువురకును మార్గ మేకమేగాని
ధరఁ దల్లి వినుము భేదము లేదు చూడ
మదిలోన నీ విట్టి మహిమ భావించి
మదికి రమ్యంబైనమార్గమం దుండి
గురుతరముగఁ బంచకోశంబులకును
బరమునకైయున్న భావంబుగనుము
అన విని యాదేవి యాత్మజుఁ జూచి
విను మోహరబ్రహ్మ వేదాంతవేద్య.

## పంచకోశప్రకరణము.

పంచకోశంబుల భావముల్ దెలియ
సంచితంబుగఁ దెల్పు మన నతం డనియె
విను మంబ యన్నంబు విఖ్యాతి బ్రహ్మ
మనిశ్రుతియందలి యలరంగఁ బడియెఁ
గమలాప్తవార్షికకిరములవలనిఁ
గమలంబు లుదయించె ఘనసస్యసమితి
నాయె నయ్యోషధు లన్నమై యొప్పె
నాయన్నరసము దేహం బయ్యె నిట్లు
అది యాత్మ యని కొంద ఱండ్రు దృగ్దృశ్య
మది దృశ్య మని నిగమాంతము ల్వలుక
గాన దేహం బాత్మ గాదు భావింప
మానిని యీప్రాణమయ మాత్మ యంచు
పదరి కొందఱు మించి పల్కుచుండుదురు
విదితంబుగా దానివిధము భావింప
నది సూక్ష్మదేహాంగ మది యస్థిరంబు
నది యాత్మ యని చూడ నర్హంబు గాదు
అల మనోమయకోశ మాత్మ యటంచు
చెలరేగి కొందఱు చెప్పుచుండుదురు
అది సంశయాత్మకం బది యణుమాత్ర
మది చంచలము గల్గ నాత్మఁ గాఁబోదు
అలఘువిజ్ఞానమయబ్రహ్మ మగుచుఁ

బలువారు కొందఱు పల్కుచుందురు
దానికి వృత్తి సంతతమును గల్గు
గాన నావృత్తి యఖండప్రవాహా
రూప మౌ నది యాత్మ రూపంబు గాదు
కాపట్యరహిత నిక్కంబుగ వినుము
ఆనందమయకోశ మట పంచకంబు
దానికి నభిమాని తనర మాయావి
పరగంగ సైంధవో పాధిచే నతఁడు
కర మొప్పజగములు గల్పించు నడఁచు
ధరశుద్ధసత్వప్రధాన మైనదియె
యిరవొంద మాయను నెసలారఁ దల్లి
మాయావి యరయ బ్రహ్మం బనుయుక్తి
పాయక కొందఱు పల్కుచుందురు
వనజాస్య యద్వైతవాదులమాట
కనుమతింపక మిథ్య యని తలంచుదురు
అతఁ డీశ్వరుండు విశ్వైకకారణుఁడు
అతులితమాయావి యైన వెట్లనినఁ
బూని చెప్పెద నది పొందుగఁ దెలియు
భూనభోతోయదముల జలబిందు 280
మొగి సదాంతర్బాహ్యముల ప్రతిఫలిత
మగుచున్న యిటువంటియాకాశ మటుల
అలఘుమహాబింబ మాత్ముఁడై తనరి

వల నొప్పగాను సర్వజ్ఞత్వముఖ్య
విలసితగుణగణాన్వితుఁ డైనకతన
నలినలోచన సగుణబ్రహ్మ యనఁగ
నటియింపు చుండు నానావిధంబులను
నటు గాన నిర్గుణ మని చెప్పరాదు
మఱి తల్లి విను మన్నమయకోశ మమరఁ
గర మర్థి నీస్థూలకాయమై యొప్పె
నవ్వలకోశత్రయంబు భావింప
నవ్వల సూక్ష్మాంగ మలరారు చూడ
అలఘుపంచమకోశ మయ్యెఁ గారణము
తలఁప మాయారూపు తను వయ్యె నట్లు
ఆమాయ నాత్మజ్ఞు లందు లే దండ్రు
వామాక్షి సంశయవారితంబుగను
పరఁగఁ జిత్తమును నభస్థలమైన
సురుచిరం బాశ్రయ శుద్ధవిజ్ఞాన
పటిమచే నైశ్వర్యభావంబు నొందు
నట భ్రాంతిచేఁ గల్గినటువంటిమాయ 290
సకలాశ్రయబ్రహ్మ సంవిత్తుచేత
నకలంకముగ నష్ట మౌనక్షణంబునను
జననిబుద్ధాబుద్ధజను లిందుఁ గొంద
అనుమతింపక యుందు రాయుక్తి వినుము
అలరంగ రజతాని కలభిన్నధర్మ

ములు గల్గి యాభాసమును గల్గె నంచు
తొలినుండి భిన్నసత్తులు గావు విశ్వ
ములకుఁ బరబ్రహ్మ మనియెడువాఁడు
ధరణీస్థలిని వేదతత్త్వండుగాని
పరగ మూఢుం డెట్లు భావింపఁ గలఁడె?
అటువలె నిశ్చయం బందె నీమనము
నిటులైన విశ్వ మే దెసఁ దలంపంగ
మదిలోనఁ దన కనుమానంబు కొంత
కదిసి యున్నందున కల్గె నవ్వేళ
జనని యివ్వలపుచ్ఛ సద్బ్రహ్మ మనఁగ
ననువొందఁ బంచకోశాతీత మయ్యె
నది యసత్యం బన్న నమృతంబు వెలయు
నదియ నీవును నేను నఖిలవిశ్వంబు
సచ్చిదానందాబ్ధి సంపూర్ణ మగుచు
నెచ్చక తగ్గక యేకమై యుండు
నది మనం బందెఁ దదన్యభావమున
విదితంబుగాఁ జూచి విశ్వంబు మఱువు
మది యెట్లనిన నీసమాధానమతిని
ముద మొప్ప వినుము నే మొనసి చెప్పెదను
పని బూని వామగుల్ఫమున నాధార
వనజంబు పీడించి వామేతరంబు
వామాంకతలమున పైపుగ నిడిన

యామహానీయముక్తాసన మాయె
నియ్యాసనంబున నేకచిత్తమున
నెయ్యంబుతో నిల్చి నిక్కించి నడుము
దృష్టి నాసాగ్రానఁ దిరముగ నుంచి
యష్టమదంబుల నడఁచి పిమ్మటను
ఘటపటాదులమాయగాఁ జూచి యచట
ఘటితమైనది సత్తుగాఁ గనుంగొనుము
ఆసత్తు విస్ఫురణాకార మగుచు
భాసురచిత్తుగఁ బ్రబలుటఁ దెలిసి
రహిఁస్థూలసూక్ష్మగారణముల వెలుఁగు
సహజవస్తువు నేకసరణిగఁ గాంచి
అరయ ననే కోర్వి యండకోశములు
వరుస నావరణతత్వముల నన్నిటిని 310
హెచ్చుగ నోతల్లి యెలరార వినుము
సచ్చిదైక్యంబుగ సమరసింపుచును
అస్తిభాతులచేత నడఁచి వైచుచును
వస్తుమాత్రం బెల్ల నారూప మంచు
నారూప మెంచ స్వయంజ్యోతి యేక
మారూఢి సరణిచే నాత్మగాఁ గనిన
నాయాత్మ నాదిమధ్యాంతము ల్దొలఁగి
మాయావిరహితమై మది భేద ముడుగు
నప్పుడు ఘనసచ్చిదానందపూర్ణ

మొప్పగ నీవగుదుర్వి లోకముల
కరమర్థి నప్పుడు జగద్వ్యాపనముల
దొరఁకొని మనమందుఁ దోఁచినగాని
హస్తిభాతులచేత నాత్మగాఁ గనుచు
నిస్తరంగం బైన నీరధిఁ గిది
కల లేనినిద్ర రగతిని భేదంబు
తొలఁగి సంపూర్ణమై తుర్యమా నంచు
నిర్వికల్పంబున నిశ్చలత్వమున
సర్వ మఖండమై సత్యమై నిత్య
శుద్ధబుద్ధవిముక్తి సొంపొంది పరమ
సిద్ధాంతసిద్ధమై చెలఁగుచునుండు
నోయమ్మ యచట నేనుండి పయిపుడ
నీయాత్మ దర్శించు నిశ్చయంబుగను
వలనొప్పఁ దెలియఁగ వలెనని యాత్మ
నలరార దర్శించు సత్ప్రపంచంబు
క్రమముగఁ జెప్పె నుత్కంఠ దీపింప
నమలమానస యోగ యాదేవహూతి
అలఘుత్వమైనముక్తాసనమందు
నలువొందఁగఁ గూర్చుండి నడుము నిక్కించి
మెడ దృఢంబుగ నిల్పి మిహిరాబ్జరిపుల
నడరంతఁ గూర్చి నాసాగ్రంబు చేర్చి
అనుపమసద్బోధ యనువహ్నిలోను

జనియించినశక్తి విజ్ఞానదీపంబు
కరమొప్ప మతియను కరమునం బూని
చారవంగ హృద్వీధిఁ జొచ్చి శోధించి
అచ్చటినాళంబు లచ్చటిక్రమము
లచ్చటిచోద్యంబు లరసి చూచుచును
చెలువగు దేహపశ్చిమభాగమందు
నిలిచి వీణాదండ నిజమై తనర్చి
యొనర దీర్ఘాన్తియు నొఱప్పుగ నమరి
తనుతరంబై బిసతంతుచందమున
సురుచిరంబైన సుషుమ్నంబునంటి
కరమర్ధితో నూర్ధ్వగమనంబుచేతఁ
జెన్నలరిన మేరుశిఖరిపైఁ జేరి
కన్నచోటున బయ ల్కలయ భావించి
నొలయ కప్పుడు వెలి చూపులోఁ జూపు
నలరారఁగాఁ జూచి యట రెండు విడచి
మహనీయతరమైన మధ్యలక్ష్యమున
సహజంబుగా నిల్పి సంతసమంది
నెలవుగ నాత్రివేణీసంగమమునఁ
జలన మొందక నిల్పి స్నానంబు చేసి
లాలితజ్ఞప్తి కళామాత్రమైన
లీలనొందెడి యాత్మలింగంబు గాంచి
అర్మిలి దీపింప నర్చింపఁ దలఁచి

పేర్మిగల్గిన చతుష్పదమందుంచి
అమలమౌ తత్వమస్యాదివాక్యములు
క్రమముగ మంత్రముల్గా స్మరింపుచును
ప్రణవం బనెడుఘంటపట్టి వాయించి
గణనము చేయక కామాదులనెడు
ఘనవిఘ్న కారిరాక్షససమూహముల
మునుకొని బలుదూరమునఁ బాఁదోలి
కూర్మితోఁ బూర్వ మాగురుని కర్పించి
కర్మనిర్మాల్యంబు కడపట ద్రోచి
అలమట శమదమం బనెడుతోయమున
నలరు నర్ఘ్యము పాద్య మాచమనంబు
నలువొప్ప నొసఁగి స్నానంబు చేయించి
బలమైన సమదృష్టిభావన యనెడు
పరిశుద్ధసాత్వికాంబరము ధరించి
యరుదుగ శక్తిత్రయము నొనఁగూర్చి
తనర యజ్ఞోపవీతంబుగ నిచ్చి
యనుపమసద్విద్య యనుగంధ మలఁది
తనభూతదయ నక్షతలుగ ధరించి
సునయగుణములను సుకృతవాసనలు
తనరుపుష్పములు సద్భక్తియనుపూజ
మనమురంజిల్ల సమ్మతముగఁ జేసి
రమణీయమగు నంతరంగచతుష్ట

యము ధూపముగనిల్పి యఖిలేంద్రియాది
ప్రమదము పేర్మి దీపంబుగ నొసఁగి
యమరినజవతత్వ మగుసుధారసము
మునుకొని నైవేద్యముగ సమర్పించి
తనకార నానందతాంబూలమిచ్చి 320
పరగాత్మప్రత్యయప్రభ సముజ్వలము
పరఁగ సువర్ణపుష్పంబుగనిచ్చి
పంచభూతములఁ బ్రపంచమంతయును
పంచార్తులుగ సమర్పణమొప్పఁజేసి
అట చిత్తవిశ్రాంతి యనుప్రదక్షిణము
పటుముదంబునఁజేసి బ్రహ్మైక్యమనెడి
ఘననమస్కార ముత్కంఠతోఁజేసి
తనలోనిపరమాత్మ దాఁ జూడఁగాను
చూపురూపుననంటి పొరిదిగనట్టి
చూపురూపైక్యమై సుస్థిరమైన
ఆత్మలింగము తానయై ప్రకాశించు
నాత్మానుభవమునం దలరుచుసాక్షి
మననంబు మఱచియు న్మనుజెందునపుడు
మొనయ జ్ఞాతృజ్ఞానములు జ్ఞేయమందు
సంధమై యవివేకగూర్మి యంతయును
రూపిగ సచ్చిత్స్వరూపమైనట్టి
నిర్వాణపదమందు నిండియేకముగ

నిర్వికల్పంబున నిద్దురఁజెంది
తానున్నైకొంతతాఁ దడవుండి లేచి
మానినీమణి సత్కుమారునింగనియె 360
జయసర్వభూతాత్మ జయపరమాత్మ
జయచిన్మయాకార జయవేదసార
జయకలుషవిభంగ జయమహాలింగ
జయసత్యసంకల్ప జయనిర్వికల్ప
నీకటాక్షంబున నిర్గుణమంద
ప్రాకటంబుగ నైక్యభావమొందితిని
ఆయాత్మలోపల నఖిలవిశ్వంబు
మాయగనున్నది మైనీడమాడ్కి
నవిసత్యమన్న మహాద్వైతమందు
నుదితస్వదంతర మున్నదేతండ్రి
వ్యావహారికమాత్మ నంగీకరించి
వావిరి రెండని వచియింపవలసె
గురుతరంబుగఁబూజ గొనెడువాఁడెచట
చిరభక్తితోఁబూజ సేయువాఁడెవఁడు
సరవిఁబూజింపఁ బూజాద్రవ్యమేది
అరయఁగ వాఙ్మానసాతీతమగుచు
సొరిదిగ నిన్నుఁ బ్రస్తుతిచేయు టెట్లు
పురుడించుసర్వప్రపూర్ణమౌ నిన్నుఁ
జెలఁగి యావాహన చేయుటయెట్లు

తలఁప సర్వమున కాధారమౌ నీకు
విహితాసనంబు గావించుటయెట్లు
సహితగుణంబును మఱియుండు నీకుఁ
దనరార నర్ఘ్యపాద్యము లిచ్చు టెట్లు
మొనసి సత్పరిశుద్ధముగ నుండు నీకు
నలరార నాచమనాదుల యెట్లు
మలినంబు లేక నిర్మలముగ నెప్డు
వెలుఁగుచుండెడు నీకు వేఱతోయమునఁ
జెలువుగ స్నానంబు సేయించు టెట్లు
కొమరొప్ప విశ్వాంకుఁడవైన నీకు
సమరంగ నొకవస్త్ర మర్పించు టెట్లు
మొనయఁగఁ గులగోత్రములు లేని నీకుఁ
దనర యజ్ఞోపవీతము లిచ్చు టెట్లు
పొలుపొంద నవయవంబులు లేని నీకు
వలనొప్ప భూషణావళిఁ దాల్చు టెట్లు
అనఘ నిర్లిప్తుఁడవై యున్న నీకు
మును గుసుమార్చనంబును జేయు టెట్లు
సలలిత గుణనిరంజకుఁడవౌ నీకు
నెలమిగ ధూపంబు లిచ్చుటయెట్లు
వనజాప్తచంద్రపావకులరూపముల
నొనరెడు దీపంబు నొసఁగుటయెట్లు
పొలుపార నిత్యతృప్తుఁడవైన నీకు

నలరంగ నైవేద్య మర్పించు టెట్లు
మొనసి సదానందమునఁ జొక్కనీకుఁ
గొనకొని విడెము మక్కువనిచ్చు టెట్లు
మురువగు నాద్యంతములు లేనినీకుఁ
బరువడి మంత్రపుష్పము నిచ్చు టెట్లు
సునిశితస్వప్రకాశుఁడవైననీకు
నొనర నీరాజన మొసఁగుటయెట్లు
అనిశ మనంగుఁడ వౌనీకు భక్తి
మొనసి ప్రదక్షిణమును జేయు టెట్లు
వారక యద్వైత వస్తువౌనీకుఁ
జేరి ప్రణామంబు చేయుటయెట్లు
సారస్వతుల కగోచరమైననిన్ను
ధీరత్వముగ వినుతించుటయెట్లు
పొలుపొంద నిశ్చిత్తముగ నుండునదియె
నెలవుగ నిన్ను ధ్యానించు క్రమంబు
ఊరక నిష్క్రియ నుండుచందంబె
భూరిభక్తిని నిన్నుఁ బూజించువిధము
ఘననిశ్చలత్వంబు గల్గియుండినదె
యొనర ప్రదక్షిణం బొనరించుసరణి
నలరు సోహంభావ మందునిల్చినదె
చెలఁగి ప్రణామంబు సేయుభావంబు
మొనయు నాత్మజ్ఞానమున నేకనిష్ఠ

నోవరుసంకీర్తన మొనరించురీతి
పరిపూర్ణభావసంపద గల్గినదియు
· రక్షైనమంత్రజపంబు సేయుగతి
అలరార నెప్పుడు కృత్యాకృత్యములను
వెలియక మరచుట దివ్యాశమంబు
అంతియకాని మహాబ్రహ్మమందు
వింతగభావంబు వేఱేమి లేదు
మఱియున్న దదియున్న మాడ్కిఁ గన్పట్టు
మఱిపోవ నదిపోవు మాయమాయగనె
అతులితబ్రహ్మమం దాకలంకంబు
సతమానె చూడ వసంతకాలాన
నతులితంబుగనుండు నబ్జాప్తకరణి
విపతిప్రకాశింప వింతగనందుఁ
బెదరెడి మఱుమరీచికచూచి జలము
కదలుచున్నది గ్రోలగావలెనంచు
భ్రాంతిచే మృగములు పరువెత్తుకొంచు
నెంతదూరముపోవ నెదురుగజలము
కదలిపోవుచునుండు కైవడిగాను
మనికి దృగ్వ్యాపారమహిమ లోఁదోఁచుఁ
గాని లేదనెడి నిక్కముదోఁచపోదు
గానఁ దద్భ్రాంతి నేఁ గడఁ గనలేక
సుడివడితిరిగించు సుడిగుంతరీతిఁ

గడఁగానరాని యఖండాత్మకాంతి
అతిశయంబునఁదోఁచు నఖిలప్రపంచ
మతిసత్యమై యుండునట్లుండుగనుక
జనులీప్రపంచ మసత్యమటంచు
గనుకంటభావించి కడఁగానలేక
సతతంబు నీప్రపంచము నిత్యమంచు
నెంతకాలంబున్న నెదురుగజలము
గనుపించుచుండును గానియాలేమి
గనుపించు దీకర్మకాండంబు చూడఁ
గావున నీకర్మకాండచేఁ బుట్టి
వోవుచుందురు ముక్తి పొందంగలేక
ఘనతరసుజ్ఞానకాండను సత్తుఁ
గనినధన్యులకు మోక్షంబుసిద్ధించు
పరగరజ్జువుఫణిపగిది తోఁచెదగి
యరసిచూచినవెన్క నదిలేనిమాడ్కిఁ
బరమాత్మయందీ ప్రపంచంబుమొదలు
తెలఁగొప్పుచుండు నీతీరున నెపుడు
పావనసుజ్ఞానపటిమచే దాని
భావించిచూడఁగ భగ్నమైపోవు
ఇట్టిమిథ్యారూప మెసఁగువిశ్వంబు
పట్టుగ నిరతమీ బ్రహ్మంబునందు
నున్నదియనికొంద ఱౌనరభాషింతు

రున్న దిసత్తైన నున్న దేజగను
తాను దానను దాని తలఁచినంతటను
నేను నేనను వాఁడు నీరసంబయ్యె
నేనెవ్వఁడో యని నేను భావించి
నేను గా కటు మున్నె నేను దానయ్యె
నేను తానైక్యమై నిలిచి మూఁడంగ
నేను దాననరాని నేను నేనైతి
లలినెంచ సలిలము లవణమైయుండి
సలిలంబులోఁబడి సలిలమౌ కరణి
నా బ్రహ్మమీ జీవుఁ డనిపించి పిదప
నా బ్రహ్మమును బొంది యనియుఁ దానయ్యె
మొనసి పరబ్రహ్మమును నేను గంటి
నను మాట లేభ్రాంతి యదియెట్టులనినఁ
దనముఖంబెవఁడైన దర్పణమందుఁ
గని దర్పణము దీసి కడనుంచినప్డు
మును దాను దర్పణమును జూచుచున్న
తన ప్రతిబింబంబు తనలోనఁ గలయు
నలరంగఁ బరమాత్మఁ డాబుద్ధియందుఁ
జెలువొంద బ్రతిఫలించిన తన్వు దాను
కనుచున్న తఱిబుద్ధి గరిగివోవగునె
తన ప్రతిబింబమై తనమాడ్కినుండు
జీవుండు తనయందుఁ జెందుట కాని

జీవుండు తన్నుఁ జూచిన నెందుఁగలదు
ముఖదర్పణంబులో మొనసిబింబంబు
ముఖము తా ననిజూచి ముదమందుఁగాని
ముఖముకైవడి నద్దమునఁ గానఁబడును
ముఖముసత్యంబైన ముఖము గన్గొనునె?
అలబుద్ధిచూపునా యభవుండటంచు
పలికినజడమది భావింప లేదు

గనులద్దమునుజూచుఁ గానియద్దంబు
కనులఁజూచుటలేదుగద పరికింప
నెలమినద్దములేక యీక్షణయుగము
వెలయఁగఁ దనుదాను వీక్షింపఁగలదె? 430
కనుదోయిఁ దనుదాను గనిసంతసింప
దనరనద్దంబు సాధనముగనుండు
నారీతిపరమాత్ముఁ డాత్మప్రకాశ
మారూఢిఁగాఁ జూడ నమరుచు బుద్ధి
అల[illegible]రసాధన మైయుండుఁగాని
యలరుభావాతీత మైన బ్రహ్మమును
గనెడుసాధనమెందుఁ గలదెన్నటికిని
గనుచుండునదె సాక్షిగా సంతసంబు
పరిపూర్ణతరమగు బ్రహ్మైక్యమునకు
సరవిగనొకజిక్కు చనుటేలయొలమి
అలరువవిద్యాదు లనెడునుపాధు

లలకారనశియించు నాత్మణమందె
యుండెడు చేతనే యుండుపూర్ణముగ
నుండెడుబ్రహ్మము దూరకేకలయు
సరవిమైనుండును సాదృశ్యమొకటి
వెలపుగనీకునే విన్నవించెదను
ఘటముభిన్నంబైన ఘటపటాకాశ
మటగగనంబున మఱియుండుఁగలసి
ఆమఠంబడఁగిన నామఠాకాశ
మామఠాకాశము నందుండిగలయు
నారీతిగానట్టు లైనపిండాండ
కారణవిద్య దగ్ధంబయివోవు
సొరిదిగాకుండిన చోటనయుండి
సరగునజీవుఁ డీశ్వరునిలోఁగలయు
నారీతిగా దివ్యమగుశుభకాండ
కారణమగుమాయ క్రమమదెముందె
కప్పురంబునుగాల్పఁ గిడపటదాను
నుప్పరంబున వోవుచుండినరీతి
అలవిద్యతుదను మహాబ్రహ్మమంది
వెలిఁగిలయంబొంది వేఱతాలేక
గానగు నావిద్య గల్గినయపుడ
పూనిప్రపంచబుద్ధ్యుద మొందులేదు
అంతట యిదిమిథ్య యనరాని యొఱుక

వింతయొక్కటిలేక వెల్గుచునుండు
నటువంటిబ్రహ్మమేనైతి కలంక
మెటులైనజనియింప దిదినిశ్చయంబు
బట్టబైటను మోక్షదమిట్లుదనరు
నెట్టులంగనుగొందు శ్రీబ్రహ్మవిద్య
అప్పుడాకపిలాఖ్యుం డాదేవహూతి
నొప్పుగఁగన్గొని యొగినిట్టులనియె
జననిరో బహుజన్మసంస్కారవహిమ
ఘనతరమైయుండె గనుకశీఘ్రముగ
పరమనిర్గుణపర బ్రహ్మైక్యభావ
మరుదుగఁబొందితి వంతియచాల
నందఱకిదిలభ్యమైనప్రపంచ
మెందుండునటమీఁద నెసలారతల్లి
అనువుగనెపుడున్న యదిలేనిదంచు
నెనకలరీతి లేనిది యున్నదంచు
బలముగభావించు ప్రాకృతజనము
వలనవిశ్వంబట్లు వర్తింపుచుండు
నొనరంగ వారులేకుండినమాయ
కునికి యెక్కడలేక యూరకపోవు
దానికియుక్త మాత్మజ్ఞానవిద్య
గానతద్విద్య నిక్కముగుప్త మగుచు
వరపతివ్రతరీతి వర్తింపుచుండు

కరమొప్పుచుంగర్మ కాండాదులెల్ల
సామాన్యగణికాళి సరణినటించు
కామయుక్తులకుభోగముల నొసంగు
ఆభోగములరోసి నటువంటిఘనుల
చేభగ్నమగుదాని చిత్రమంతయును
అటమీఁదఁదానాత్మ ననెడునిశ్చయము
దిటవుగఁ గల్గుసందేహంబు తలఁగు
నంతట పరిపూర్ణమై తాను వెల్గు
నింతంతకీకర్మ మెఱుఁగంగరాదు
సులభంబుగల్గునీ సుజ్ఞానవిద్య
సులభకాఠిన్యవిస్ఫురణ మెట్లనిన
నేను నేనని పండి నిండినదెలుక
నేననిసులభమా నెఱిఁగిహంకృతిని
నేననఁగఠినమౌ నిశ్చయమందుఁ
గాన నీబంధమోక్షంబులు రెండు
వలనొప్పఁగలవని వచియింపవలసె
నలకంటఁగని నిశ్చయంబుభావించి
ఆబంధమోక్షంబు లభ్రముల్గాని
యాబంధమోక్షంబు లాత్మకెక్కడిది
నిత్యముక్తుఁడాత్మ నిర్గుణుండనెడి
సత్యమూహించిన సంకల్పమేది
ప్రాకటముగనిట్టి భావనిశ్చయము

నీకులభ్యంబయ్యె నెఱిఁగన్న తల్లి
ఇరువుగమఱియు నింకెన్ని చెప్పినను
నిరుపమానందమౌ నిశ్చలమొకటి
పరగనీనిశ్చయ భావంబుచేత
నరయకపరమాత్మ నంచుభావించు
భానుప్రకాశమంబరమెల్ల నిండి
పూనియుండియును సద్భూరికాంతియొగి
స్ఫుటముగఁగనరాక భూవృక్షశైల
ఘటపటాద్యాకార ఘనయౌవెలుంగు
సరణిఁబరాత్ముఁ డాసనముననుండి
కరణాదులందుం బ్రకాశించుచుండు
సంతతం బీరహస్యముభావమందుఁ
జింతింపుచుండు సుస్థిరముగ జనని
ఇలభానుఁడస్తాద్రి కేగినవేళ
కళల వెల్గుఁ దక్కకజాలమెల్ల
అమరనాతనియందు ననువొందుమాడ్కి
నమనస్కమున నడఁగావిశ్వమెల్ల
గనుక యీయమనస్క ఘనుతరాభ్యాస
మున నీవు పరిపూర్ణముగ నిండియుండు
మానసమున వేంకమాంబికరచిత
మైననట్టి రాజయోగామృతసార

మందెన్నఁగాఁ దృతీయప్రకరణము
పొందుగఁ దఱికుండపురిధాముఁడైన
వీరనృసింహుఁడు వెలయఁగైకొనియె
ధారుణి నాచంద్రతారార్కముగను

రాజయోగసారము తృతీయప్రకరణము

సంపూర్ణము.



చెన్నపురి: 'శ్రీరామ' ప్రెస్సున ముద్రితము.—1930.

# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యము.

| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి . . | 1 | 4 |
| అడవిమల్లెలు, ఎనమండ్ర నారాయణమూర్తిగారిది | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారి విపుర్శతో నున్నది ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాసముతో మేలుకాగితములమీఁద చక్కఁగ నురల ముద్రింపబడినది. ... | 3 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇది వఱకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | 7 | 8 |
| డిటో 3 సంపుటములు ... | 9 | 0 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు ... | 0 | 12 |
| ,, కాలికోబైండు ... | 1 | 2 |

శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:—

అనేకవ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణ పరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచి కాలికోబైండు చేయఁబడియున్నది.

| | | | |
|---|---|---|---|
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | ... | 13 | 0 |
| ఆది సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | .. | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ,, | ... | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 3 | 12 |
| శాంతిసప్తము ,, | ... | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | | 1 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, వల్లాది సూర్యనారాయణ శాస్త్రిది | ... | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు-టీకానుక్రమణికాసహితము, కాలికో | | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ |
|---|---|
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు, గిల్టుబైండు ... | 2 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | 1 |
| కలిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది . | 0 |
| కవికర్ణరసాయనము (మాంధాతృచరిత్ర) కావ్యము | 1 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | 2 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు .. | [illegible] |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | 0 |
| డిటో గట్టుప్రభుకృతము . | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | 0 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు ... | 0 |
| గద్యపద్యసంగ్రహము ... | 0 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు . | [illegible] |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలి సొంపు; పీఠిక అతివిపులము .. | [illegible] |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | 1 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి .. | 1 |
| డిటో మేలుప్రతి, గ్లేజు కాగితములది ... | 1 |
| తెనుగుసమస్యలు ... | 0 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము | 1 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము ... | 2 |
| దసరాపద్యములు ... | 0 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి ఈ.